# ఉపోద్ఘాతము

ఇది ఎస్టేటుడ్యూటీ ఆక్టు అని క్రొత్తగా వచ్చిన ఒక చట్టము. 1953 వ అక్టోబరు 15 వ తేదీనుంచి అమలులోనికి వచ్చినది. పెద్ద ఆస్తిపరులందరు దీని సంగతి తెలిసికొనుట అవసరమై యున్నది. ఆంధ్ర రాష్ట్రములోని అట్టివారు తమంతట తాము చదువుకొని సంగతులు తెలుసుకొనగలుగుదురని ఈ తెలుగుప్రతి వ్రాసి అచ్చొత్తించితిని.

ఎస్టేటు అననేమి? డ్యూటీ అననేమి? పిఠాపురం ఎస్టేటు, విజయనగరం ఎస్టేటు, జయపురం ఎస్టేటు, ఇటువంటి ఎస్టేటుల్యాండు ఆక్టు క్రింది ఎస్టేటా? కాదు. ఈ ఆక్టుక్రింది ఎస్టేటు అంటే ఆస్తి అనే అర్థము. ఇంత, అంత అనిలేదు. ఇటువంటిది, అటువంటిది అనిలేదు. అన్నిరకముల ఆస్తిన్ని ఎంతైనను సరే, ఎస్టేటే. ఈ ఆక్టులో 'ఎస్టేటు' అను మాటకు నిర్వచనము లేదు. 'ఆస్తి' అను మాటమాత్రమే నిర్వచింపబడినది. అన్ని రకముల చరస్థిరాస్తిలయందు నుండెడి ఇంటరెస్టు, దానిని అమ్మగా వచ్చేసొమ్ము, ఆ సొమ్ముతో వేసేనిలవ, ఒక రకములో నుంచి ఇంకొక రకములోనికి మార్చబడిన ఆస్తి, ఇవన్నియు 'ఆస్తి' అనే మాటలలో చేరునని నిర్వచన చేయబడినది. దీనిని బట్టి ఎస్టేటు అనగా ఆస్తి అనియే అనుకొనవలెను.

డ్యూటీ అంటే ఏమా? సేల్సుటాక్సు, ఇన్కంటాక్సు ఇంటిపన్ను, వృత్తిపన్ను, ఇటువంటిదేనా డ్యూటీ? నిఘంటువులో 'డ్యూటీ' అంటే పన్ను అనే అర్థంవుంది. అయితే దీనిని ఎస్టేటు టాక్సు అనక ఎస్టేటు 'డ్యూటీ' అన్నారు. కారణము బహుశా, అర్థము ఒకటే కనుక, దీనిని గౌరవార్థము డ్యూటీ అని అనియుండవచ్చును. లేదా శాసనకారుల అభిప్రాయములో పెద్ద ఆస్తులెవరికిన్నీ ఉండకూడదట. అంటే వాటికి ఒక విధి, (డ్యూటీ) ఉందిట. ఆ విధి లేక డ్యూటీ ఏమిటనగా తగ్గుట. ఎల్లాగున తగ్గుట? కొంతభాగం ఒక్కొక్కమారు కొప్పున గవర్నమెంటుకు చెల్లిపోవుచుండుట. అట్లు కొన్ని మారులు జరిగేసరికి తగ్గక ఏమి జరుగును? అట్లు తగ్గిపోయే డ్యూటీ ఆ ఆస్తిది కనుక ఆ తగ్గిపోయేదానిని డ్యూటీ అనికూడ అనియుండవచ్చును.

ఈ తగ్గుట ఎప్పుడు ? సేల్సుటాక్సు సేల్సు టర్నోవరుమీదను, ఇన్కంటాక్సు రాబడిమీదనువృత్తిపన్ను వృత్తివల్ల వచ్చేరాబడి మీద ను ఇంటిపన్ను ఇంటి కిమ్మతుమీదను విధింపబడుచున్నవి. ఇది సంవ త్సరమున కొకమారో, లేక అర్ధ సంవత్సరమున కొకమారో విధింప బడుచున్నది. ఎస్టేటుడ్యూటీ అట్టిది కాదు. ప్రతి వ్యక్తియొక్క మరణా నంతరమున్ను ఎస్టేటు కిమ్మతుపై విధింపపడునదై, ఆ ఎస్టేటు ఎవరిచేతి లోనికి వెళ్ళునో వారివల్ల ల్యాండురెవెన్యూ వలె ఎస్టేటుపై ప్రధమ ఛార్జీతో చెల్లింపవలసినదై యున్నది.

ఇది పెద్దపెద్ద ఆస్తులకే గాని, చిన్నచిన్న ఆస్తులకు వర్తించదు. హిందూ జాయింటుకుటుంబములోని మెంబరుకుగల ఇంటరెస్టు అయితే అందలి కిమ్మతులో మొదటి రు 50,000- ల మీద డ్యూటీలేదు. ఇతరమైన ఆస్తి అయితే, దాని కిమ్మతులో మొదటి ఒక లక్ష రూపా యలమీద డ్యూటీలేదు. కంపెనీలలోని షేర్లు, డిబెంచర్లు అయితే అందలి కిమ్మతులో మొదటి రు 5000 ల మీద డ్యూటీలేదు. ఈలిమి ట్టులకు పైన, ఆస్తి పెద్దదైనకొలదిన్నీ డ్యూటీ హెచ్చగును. కొన్ని రాష్ట్రములలో మాత్రమే వ్యవసాయపు భూములమీద ఈ డ్యూటీ ఉన్నది. ఈ రాష్ట్రములు ఈ ఆక్టు చివర 1 వ షెడ్యూలులో చూప బడినవి. ఆంధ్ర, మదరాసు రాష్ట్రములు ఈ షెడ్యూలులో లేవు. అందువల్ల ఈ రాష్ట్రములలోని వ్యవసాయపు భూములమీద ఎస్టేట డ్యూటీ లేదు. కాని, ఈ రాష్ట్రప్రభుత్వ శాసనసభలలో వ్యవసాయపు భూములమీద కూడ ఎస్టేటుడ్యూటీ విధింపవచ్చునని తీర్మానించవచ్చు ననియు, అట్లు చేసినమీదట కేంద్రప్రభుత్వము వారు ఈ ఆక్టు 1 షెడ్యూలులో ఆ రాష్ట్రములను కూడ చేర్తురనియు, అందుపై ఆ రా ష్ట్రములలోని వ్యవసాయపు భూముల మీదకూడ ఎస్టేటుడ్యూటీ విధింపవలెననియు, ఈ ఆక్టు 5 వ సెక్షనులో చెప్పబడియున్నది. ప్రస్తు తము ఈ రెండు రాష్ట్రములలోని వ్యవసాయపు భూములమీద ఈ డ్యూటీ లేదు.

అసలు ఈ చట్టము శాసించుటలో ప్రభుత్వమునకు ఆదాయము వచ్చుటయున్ను, ఏ ఒకరికిన్నీ పెద్దపెద్ద ఆస్తులు ఉండకుండా చేయుట యున్ను ముఖ్యోద్దేశములై యున్నవి. ఈ ఉద్దేశము ప్రకారము సాంఘికముగ దేశమునకు మహోపకారము కలుగగలదని ఆశించబడు చున్నది.

ఈ ఆక్టు కూర్చుటలో ఆంగ్లదేశములో అమలులోనున్న ఆక్టు మూలాధారముగ తీసికొని, అక్కడలేని హిందూజాయింటు కుటుంబములు హిందూవితంతుకు సంక్రమించుహక్కులు మొదలగునవి మన దేశములలో నుండుటచే వానికి వర్తించునట్లు కొన్ని సెక్షనులు కల్పించి ఆక్టు తయారైనది. ఈ ఆక్టులోని సెక్షనులు చాలా పెద్దపెద్ద వాక్యములను కలిగియున్నవి. ఆ వాక్యములలో మధ్య చాలా ఉపవాక్యములు కుదించబడినవి. ఆంగ్లభాషాపరిచయులకే అందులోనూ న్యాయశాస్త్ర పరిచయులకే సెక్షను చదువ ప్రారంభించి చివరకు వచ్చుసరికి ప్రారంభ విషయము జారిపోవుట, ప్రారంభ వాక్యములోని విషయమునకున్ను తుదివాక్యములలోని విషయమునకున్ను సంబంధము కనుపించకపోవుట, ఇట్టి అవస్థలు చాలచోట్ల తటస్థించును. అట్టి ఈ ఆక్టును తెలుగున వ్రాయుటలో చాల శ్రమ యనిపించినది. వీలైనంతవరకు సెక్షనులలో నున్న నడకతోనే వాక్యములు, ఉపవాక్యములు కూర్చి, అర్థము చెడకుండగా సామాన్య చదువరికి సులభముగ గ్రాహ్యమగునట్లు గ్రామ్య భాషనే ఉపయోగించి చదువరులకు సహాయపడ ప్రయత్నించితిని.

ఈ ఆక్టులోని కొన్ని పదములకు సరియైన తెలుగు పదములు స్ఫురించలేదు. అందువల్ల వాడుకలో ఎక్కువగ నలిగియున్నట్టివిన్ని సులభముగ నందరకు తెలియునట్టివిన్ని పదములనే ఉపయోగించడమైనది. మరణానంతరం ఆస్తి ఏమిజరుగునో అవనిని ఈ ఆక్టులో ఉపయోగించిన 'ప్యాసు' అను మాటకుగల అర్థము వచ్చునట్లు చెప్పవలెనన్న ప్యాసగుట, అనియే చెప్పవలసివచ్చినది. సంక్రమించుట, దఖలుపడుట, అను

మాటలవల్ల సరియైన అర్థము రాదు. ప్రొవైజో అన్న పదమునకు సరియైన తెలుగుమాట దొరకదు. అందులకు బదులుగా 'కాని' అనిన్ని, 'అయితే' అనిన్ని ఉపయోగించబడినవి. అప్పుడే ఆ అర్థము వచ్చును. 'డిస్పొజిషన్' అను మాటకు అన్యాక్రాంతము అని ఉపయోగించబడినది. ఇందలి తప్పులను లెక్కచేయక విషయములనే గ్రహింపకోరిక.

ఇట్లు,

బులుసు వెంకట్రామయ్య,

ఎడ్వొకేటు.

## OPINION.

On many occasions when I attempted to go through this new Act, I found several provisions are most complicated. Some such sections from this translation, on a comparison with the original sections in English, convinced me that the author has been doing a very valuable service to the Andhra general public, who are likly to be affected by this Act, in enabling them to understand and follow the Act, and the Rules and submit the required statements and returns for themselves before the authorities whenever occasion arises. This book gives an easy and flowing reading with the most familiar terms and expressions. One forgets that he is reading a legislative enactment and delights himself, as in any other work of art. The price fixed is quite reasonable in viw of the importance of the subjectmatter.

Kakinada<br>20—8—1954

Batchu Sanyasirao M. A. (com).<br>Vice President,<br>The Godavari Chamber of Commerce. Ltd.

---

## అభిప్రాయము.

ఇదివరలో, ఈఅసలు చట్టములోని సెక్షనులను చదువుటకు ప్రయత్నించినపుడు, చాలచోట్ల నాకు కొరకబడని భాగములను, ఈ తెలుగు ప్రతిచదివి, అసలుతో సరిపోల్చి చూడ, ఈగ్రంథకర్త ఈ తర్జుమాచేసిన పుస్తకము ప్రచురించుటలో, ఈ ఆక్టుననుసరించు ఆంధ్రప్రజలకు నిజముగా మహోపకారము చేయుచున్నట్లు నేను పూర్తిగ నమ్మగలిగితిని. ఇందువల్ల మిగుల చిక్కైన చట్టమును అందలినిబధనలను తమంతటతాము చదువుకొని, అర్థము చేసుకొని, అవసరము వెంబడిని అధికారులయెదుట తామే తగు స్టేటుమెంట్లను, రిటర్నులను యివ్వగలుగుటకీ గ్రంథము సహాయపడుచున్నది. చదువుటకు సులభముగనున్నది. చట్టము చదువుచున్నట్లు గాక,ఏ ఇతరగ్రంథము నైన చదువుచున్నట్లు చదువరి సంతసించగలడు—విషయమును బట్టి చూడ దీనివెలకూడ సమంజసముగనే యున్నది. ఇట్లు,

కాకినాడ,<br>20-8-54.

బచ్చు సన్యాసిరావు, యం. ఏ. (కామర్సు)<br>గోదావరి ఛాంబర్ ఆఫ్ కామర్సు వైస్ప్రెసిడెంటు.

# విషయసూచిక

| సెక్షనులు | | | | | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | 4 | 1వ భాగము | ప్రిలిమినరీ | ... | 1—6 |
| 5 | 20 | 2వ | ,, | ఎస్టేటుడ్యూటీ విధింపు | ... | 6—28 |
| 21 | 33 | 3వ | ,, | డ్యూటీచార్జీ లేక పోవుట... | 28—39 |
| 34 | 35 | 4వ | ,, | ఆస్తులు మొత్తముచేయుట, డ్యూటీ రేట్లు. | 39—42 |
| 36 | 43 | 5వ | ,, | ఛార్జిచేయవలసిన కిమ్మతు | 42—45 |
| 44 | 50 | 6వ | ,, | మినహాలు ... | 45—50 |
| 51 | 73 | 7వ | ,, | డ్యూటీవసూలు ... | 50—68 |
| 74 | 77 | 8వ | ,, | ఆస్తిమీఁద డ్యూటీకి ఛార్జి వసూలు చేయుటకు సదుపాయములు ... | 68—70 |
| 78 | 85 | 9వ | ,, | చిల్లర -అమాంబాపతు ... | 70—74 |
| | | | | షెడ్యూళ్ళు ... | 75—76 |
| | | | నిబంధనలు, నోటిఫికేషనులు | ... | 77 |
| 1 | 29 | | ఎస్టేటుడ్యూటీ నిబంధనలు | ... | 78—99 |
| 1 | 17 | | ఎస్టేటుడ్యూటీ (కంట్రోల్డు కంపెనీల నిబంధనలు | ... | 99—126 |

# ఎస్టేటుడ్యూటీ ఆక్టు ( 34 వ ఆక్టు 1953 )

[ 6 వ అక్టోబరు 1953 వ తేదీని ప్రెసిడెంటు ఆమోదము పొందినది.]

ఎస్టేటుడ్యూటీ విధించి వసూలుచేయుటకు ఏర్పరచిన ఆక్టు. పార్లమెంటువల్ల ఈ క్రింద్ర విధముగ శాసించబడినది.

## 1 వ భాగము. ప్రిలిమినరీ.

**1.** క్లుప్తనామము, వ్యాప్తి, ప్రారంభము:—

(1) ఈ ఆక్టు 1953 వ ఎస్టేటు డ్యూటీ ఆక్టు అని పిలువబడును.

(2) ఇది జమ్ము కాశ్మీరములు తప్ప మిగతా భారత దేశమున కంతకు వ్యాపించును.

(3) కేంద్రప్రభుత్వము ఆఫిషల్ గెజిట్టులో ప్రచురించి నియమించే తేదీ లగాయతు ఇది అమలోనికి వచ్చును.

**2.** నిర్వచనములు:—

సందర్భములను బట్టి మరియొక విధముగ నుండవలసినయెడల తప్ప ఈ ఆక్టులో —

(1) 'మదింపు అఫిడవిట్టు' అనగా రిప్రెజెంటేషనుగ్రాంటు చేయు నిమిత్తము పెట్టు ధరఖాస్తుకు సంబంధించి కోర్టుఫీజు ఆక్టు (7 వ ఆక్టు 1870) 19-1 వ సెక్షనుక్రింద యివ్వబడు మదింపు అఫిడవిట్టు.

(2) 'బోర్డులు' అనగా సెంట్రల్‌బోర్డ్సాఫీరెవెన్యూ ఆక్టు (4 వ ఆక్టు 1924) క్రింద కూర్చబడిన సెంట్రల్‌బోర్డాఫ్ రెవెన్యూ.

(3) 'కంపెనీ' అనగా ఎచ్చటనైనను సరే ఇన్‌కార్పొరేటు చేయబడిన ప్రతీకార్పొరేటు బాడీయున్ను,

(4) 'కంట్రోల్డు కంపెనీ' అనగా ఈ దిగువ 17 వ సెక్షనులో నిర్వచింపబడిన కంపెనీ.

(5) 'కంట్రోలరు' అనగా ఈ దిగువ 14 వ సెక్షనుక్రింద ఎస్టేటు డ్యూటీ కంట్రోలరుగా నియమింపబడు వ్యక్తి; డెప్యూటీ లేక అసిస్టెంటు కంట్రోలరు కూడ అగును.

(6) 'మరణించిన వ్యక్తి' అనగా ఈ ఆక్టు ప్రారంభించిన తరువాత మరణించు వ్యక్తి.

(7) 'ఎస్టేటుడ్యూటీ' అనగా ఈ ఆక్టుక్రింది ఎస్టేటుడ్యూటీ.

(8) 'ఎగ్జిక్యూటరు' అనగా చనిపోయినవానికి ఎగ్జిక్యూటరు లేక ఎడ్మినిస్ట్రేటరు.

(8) 'జనరల్ పవరు' లో దానముపట్టినవానిని లేక ఈ పవరు కలిగియున్నవానిని విల్లురీత్యా లేక దస్తావేజురీత్యా అన్యాక్రాంతము చేయగలుగునట్లు చేయు ప్రతీ పవరులేక అథారిటీ కూడియుండును. తానే చేయని అన్యాక్రాంతము క్రింద సమ్మతముతో కూడిన తాహతు (ఫిడ్యూషియరీ కెపేసిటీ) తో వినియోగించు, లేక తణఖా పెట్టినవారు వినియోగించు, పవరు కాదు.

(10) 'ఇన్కంబ్రెన్సు'లో తణాఖాలున్ను అంతరింపబడే ఛార్జీలున్ను కూడియుండును.

(11) 'వచ్చునని తలచు ఇంటరెస్టు'లో శేషించిన ఎస్టేటు లేక వారసత్వము, వెస్టు అయినదైనను, కొన్ని సందర్భములలో వచ్చునదైనను, రాబోవు ప్రతీ ఇంటరెస్టును కూడియుండును. కాని కవుళ్ళ ఆఖరున రాబోవు వారసత్వములు కూడియుండవు.

(12) న్యాయశాస్త్రీయ ప్రత్యర్థులు' (లీగల్ రిప్రెజెంటేటివులు) అనగా న్యాయశాస్త్రప్రకారము చనిపోయినవాని ఎస్టేటును రిప్రజెంటు చేయువారున్ను, మరియూ,

(i) ఎగ్జిక్యూటరు,

(ii) ఈ ఆక్టుక్రింద ఏ బాధ్యత నిమిత్తమైనను, చనిపోయినవాని ఎస్టేటును లేక అందలి భాగమును స్వాధీనపరచుకొను లేక ఎస్టేటుతో కలుగచేసుకొను వ్యక్తి.

(iii) చనిపోయినవాడు హిందూ కుటుంబములోని కోపార్సెనరు అయినప్పుడు కుటుంబయజమాని,
యు కూడియుందురు.

(13) 'ఆస్తిని ఎప్పాయింటుచేయుటకు పవరు' అనగా ఈ పవరు కలిగియున్నట్టిన్నీ హక్కులేనట్టిన్నీ అన్యాక్రాంతము నిర్ణయించు పవరు.

(14) 'నిర్ణయించబడిన' అనగా ఈ ఆక్టుక్రింది నిబంధనవల్ల నిర్ణయించబడిన.

(15) 'ఆస్తి'లో చరస్థిరాస్తులయందు ఇంటరెస్టున్ను, అవి అమ్మగా వచ్చిన సొమ్మున్ను, అట్టి సొమ్ముతో చేసిన ఇన్వెస్టుమెంటున్ను, అట్టి ఒక తరగతినుండి ఇంకొక తరగతిలోనికి మార్చిన ఆస్తిన్నీ కూడియుండును.

1వ వివరణము:—ఒక వ్యక్తివల్ల లేక వాని అనుమతితో, వాని స్వంత జవాబుదారీవల్లగాని, వాడు అన్యాక్రాంతము చేయకలిగియున్నట్టి లేక, చేయకలుగునట్టి ఆస్తిమీద రాబట్ట వీలైన ఋణము పుట్టించుట లేక యితర ఇంటరెస్టు కలుగ చేయుట, లేక తన లాభం నిమిత్తం హామీ కలుగచేయుట లేక ఋణము చేయుట అన్యాక్రాంతముగనే ఎంచబడును. మరియు అట్టి అన్యాక్రాంతము విషయములో అట్టి ఋణము గాని రైటుగాని 'ఆస్తి' అనుపదములోనికే వచ్చును.

2వ వివరణము—మరణించినవాని ఖర్చున ఒక ఋణము గాని ఇతర రైటునుగాని నశింపచేయుట, ఎవరిలాభం నిమిత్తం నశింపుచేయబడినదో వారి పేరట మరణించిన వ్యక్తి చేసిన అన్యాక్రాంతముగ నెంచబడును. అట్టి అన్యాక్రాంతము విషయములో ఋణములేక రైటు నశింపచేయుట వల్ల కలిగే లాభము 'ఆస్తి' అనే పదములో చేరియుండును.

(16) "మరణించినమీదట ప్యానయే ఆస్తి"లో మరణించిన వెంటనే గాని, కొంత కాలమునకు గాని, నిశ్చయముగా నైనను, లేక కొన్ని సందర్భములలో నైనను ఉన్నది ఉన్నట్లు అయినను, లేక మార్పుచెందినదైనను ప్యానయే ఆస్తిచేరి యుండును. మరియు 'మరణించినమీదట' లో మరణమునుండి లెఖించి తేల్చబడునప్పుడు అనే అర్థముకూడ ఉండును.

(17) 'పబ్లిక్కు ఛారిటెబుల్ పర్పను' లో బీదలకు సహాయము, విద్య, వైద్యసహాయము, భారతదేశములోని జనసామాన్యమున కుపయుక్తమైన యితరకార్యము కూడియుండును.

(18) 'రిప్రజెంటేటివు' అనగా విల్లుకు ప్రొబేటున్ను, ఎడ్మినిస్ట్రేషను ఉత్తరములున్ను అని అర్థము.

(19) 'సెటిల్ చేయబడిన ఆస్తి' అనగా ఈ ఆక్టు అమలులోనికివచ్చిన తరువాతనైనను లేక అంతకుపూర్వమైనను సెటిల్మెంటుఅమలులోనికివచ్చినట్టిన్నీ, స్వతస్సిద్ధమైన లేక జుడిషల్ అయినవ్యక్తులకు వారసత్వరూపేణా లిమిటుచేయబడిన లేక ట్రస్టులో నుంచబడిన ఆస్తి అని అర్థము. మరియు 'సెటిల్మెంటు' అనగా ఆస్తి సెటిల్ చేయునట్టి డెడికేషను లేక ఎస్టవుమెంటున్ను ఏ అన్యాక్రాంతమైనను అని అర్థము.

(20) 'వేల్యూయర్' అనగా 4 వ సెక్షనుకిింద ఎప్పాయింటు చేయబడిన వేల్యూయరు అని యర్థము.

**3. విశదీకరణను:—**

(1) ఈ ఆక్టు నిమిత్తం —

(ఎ) దావా చేయుటకు అర్హత కలిగియున్నయెడల తాను అన్యాక్రాంతము చేయగల ఎస్టేటుగాని, అట్టి ఎస్టేటులో ఇంటరెస్టుగాని, సామాన్య పవరుగాని కలిగియున్న వ్యక్తి అన్యాక్రాంతము చేయుట కర్హతగల వ్యక్తిగా నెంచబడును.

(బి) ఇంకొకరి తోడ్పాటుకావలసినను అక్కరలేకపోయినను చని పోయినవానికి గల ఇంటరెస్టునుండి అమలులోనికి వచ్చు అన్యాక్రాంతము వానిచే చేయబడిన ట్లెంచబడును.

(సి) ఒకరు ఇంకొకని ఆస్తిపై ఛార్జిచేయుటకు జనరలు పవరుగల సొమ్ము మొదటివానికి అన్యాక్రాంతము చేయుటకు పవరుగల ఆస్తిలోని ఇంటరెస్టుగా ఎంచబడును.

(డి) ఒకరి నివాసము (డోమిసైల్) నివాసమును గురించిన ఇండి యన్ సక్సెషన్ ఆక్టు 1925, (39 వ 1925 వ ఆక్టు) లోని ప్రొవిజనులు వర్తించు నట్లెంచి నిర్ణయింపబడును.

(2) ఈ ఆక్టు 2, 3 భాగములలో ఏ అన్యాక్రాంతము చేయ బడిన ఇంటరెస్టు, ఇస్స్యూరు చేయబడిన పోలసీ, కొనబడిన లేక ఏర్పరచబడిన ఏన్యుయిటీ లేక ఇతర ఇంటరెస్టు, లేక దాన ము, సెటిల్మెంటు, అన్యాక్రాంతము లేక ట్రాన్సఫరుచేయబడిన ఆస్తి అని అయినను చెప్పబడినవి ఈ ఆక్టు అమలులోనికి రాక ముందు లేక వచ్చినతరువాత చేయబడినవి అని అనుకొన వలెను.

4. ఎస్టేటుడ్యూటీ అథారిటీలు:—

(1) ఈ ఆక్టుయొక్క పనుల నెరవేర్చుటకీ క్రింది ఆథారిటీ లుండును.

(ఎ) బోర్డు.

(బి) ఎస్టేటుడ్యూటీ కంట్రోలర్లు.

(సి) వేల్యూయర్లు.

(2) కేంద్రప్రభుత్వము వారికి తోచినంతమంది ఎస్టేటుడ్యూటీకంట్రో లర్లను ఎప్పాయింటు చేయవచ్చును. వారు బోర్డువారి కంట్రో లుకు లోబడి బోర్డువారు నియమించే ఎస్టేట్లు, తరగతుల ఎస్టేట్లు, విషయములలోనున్ను, ప్రదేశములలోనున్ను వారి అధికార మును చలాయింతురు.

(ప్రొవైజో) అయితే బోర్డువారుచేయు నిబంధనలకులోబడి, ప్రతీకంట్రోలరు తన జూరిస్డిక్షనులో చనిపోయినవానియొక్క ఎంత కొద్ది ఆస్తివున్నప్పటికిన్నీ, అట్టి చనిపోయినవాని పూర్తి ఎస్టేటు మీాదగాని, కొంతమీాదగాని ఈ ఆక్టుక్రింద తనకుగల అధికారమును చలాయించవచ్చును.

ఇంతేకాక బోర్డుజనరల్ లేక స్పెషల్ ఆర్డరువల్ల బోర్డు నియమించే కంట్రోలరును ఈఆక్టుక్రింద కంట్రోలరు ప్రత్యేకముగా చలాయించే ఆధికారమును చలాయించునట్లు డైరెక్టు చేయవచ్చును.

(3) ఈఆక్టు అమలులోనికివచ్చిన 12 మాసములలోనున్ను దరిమిలాను అప్పుడప్పుడున్ను అర్హతగలవారిని తగినంతమంతిని వేల్యూయర్లుగా కేంద్రప్రభుత్వము ఎప్పాయింటుచేసి, వారిజీతము.ల స్కేలులను నిర్ణయింతురు.

(4) పబ్లిక్కునౌఖరీలు పోస్టులలోని వారి నౌఖరీషరతులు రెగ్యులేటుచేయుటకు కేంద్రప్రభుత్వము చేయు నిబంధనలు ఉత్తరువులకు లోబడుపద్ధతిని, కంట్రోలరు తనపనులను నెరవేర్చుటకవసరమైన ఎగ్జిక్యూటివు లేక మినిస్టీరియల్ సిబ్బందిని నియమించవచ్చును.

(5) వేల్యూయర్లుగాక, ఈఆక్టు నెరవేర్చు ఆఫీసర్లునున్ను సిబ్బందిన్ని బోర్డు ఉత్తరువులను మన్నించవలెను.

## 2 వ భాగము ఎస్టేటుడ్యూటీవిధింపు.

**5. విధింపుపరిమాణము :—**

(1) ఈఆక్టు ప్రారంభమైన తరువాత చనిపో ప్రతీవ్యక్తి విషయములోను, ఇటుపైన స్పష్టముగా చెప్పినట్లుతప్ప, ఆవ్యక్తి చనిపోయినప్పుడు ప్యాసగునట్టి, 1 వ షెడ్యూలులో నిస్టేట్లలో

నున్న వ్యవసాయపుభూములుతోసహా, సెటిల్ చేయబడినది. గాని చేయబడనిదిగాని యీావదాస్తికి, ఇటుపైన చెప్పబడునట్లు నిర్ణయించబడు అసలు కిమ్మతుమీద 25 వ సెక్షనులో వివరించు రీట్లప్రకారము ఎస్టేటుడ్యూటీ అనే ఒకడ్యూటీ విధించబడి, చెల్లించబడవలెను.

(2) కాన్‌స్టిట్యూషను 252 వ ఆర్టికిలు 1వక్లాజు ననుసరించి యితర స్టేటులలోని వ్యవసాయపు భూములపై ఎస్టేటు డ్యూటీ విధించుటకు ఆయాస్టేటుల శాసనసభలు తీర్మానములు ప్యాసు చేయునెడల, కేంద్రప్రభుత్వము అఫిషల్ గెజట్టులో ప్రచురించుటమూలముగా అట్టి స్టేటులనుకూడా ఈఆక్టు 1 వ షెడ్యూలులో చేర్చవచ్చును. అట్టి ప్రచురణపై చేర్చబడుస్టేట్లు 1వ సబుసెక్షను అర్థములో 1 వ షెడ్యూలులోనిస్టేట్లుగా నెంచబడును.

ప్యాసైనట్లెంచబడు ఆస్తి.

**6.** అన్యాక్రాంతము చేయుగల ఆస్తి:—

చనిపోయినప్పుడు చనిపోయినవానికి అన్యాక్రాంతముచేయుటకు అర్హతగల ఆస్తి, చనిపోయినప్పుడు ప్యాసయే ఆస్తిగా ఎంచబడును.

**7.** చనిపోయినమీదట అంతరించే ఇంటరెస్టులు:—

(1) ఈసెక్షనుకు లోబడి, చనిపోయినవానికి లేక ఇంకొకరికి ఏఆస్తియందు చనిపోయినవారి మరణముతో అంతరించే ఇంటరెస్టు కలదో అట్టి ఆస్తిన్ని ముఖ్యముగా మితాక్షర, మారుముక్కతాయం, ఆల్యశాంతనలా వర్తించే హిందూకుటుంబములోని జాయింటు కుటుంబాస్తియందలి కోపార్సెనరీ ఇంటరెస్టుకూడా,

చనిపోయినవాని మరణముపైన అంతరించుటవల్ల లాభము కలుగునంతమట్టుకు, ప్యాసైనట్లెంచబడును.

(2) మితాక్షరాసూత్రాలు లాచే పాలింపబడు హిందూకోపార్సెనరీ మెంబరు చనిపోయినయెడల, కుటుంబాస్తియందలి చనిపోయిన వాని ఇంటరెస్టుకు,

(a) చనిపోయినవాడు చనిపోవునాటికి 18 సం॥లు వయస్సు పూర్తి చేసియున్నయెడలను,

(b) చనిపోవునాటికి 18 సంవత్సరములు పూర్తిచేసి యుండనియెడల వాని తండ్రిగాని, వాని యితర పూర్వపురుషుడుగాని అదే కుటుంబములో కోపార్సెనరు కాకుండావుండేయెడలను,

మాత్రమే 1 వ సబుసెక్షనువర్తించును.

వివరణము:—

చనిపోయినవాడు కోపార్సెనరీలో ప్రత్యేకము వేరేఆస్తి కలిగియున్న సబుకోపార్సెనరీ మెంబరుఅయినయెడల ఈసబుసెక్షను కోపార్సెనరీకిన్నీ సబుకోపార్సెనరీకిన్నీ వేరువేరుగావర్తించును.

(3) మారుముక్కతాయం వారసత్వపుసూత్రాలు వర్తించే తార్వాడ్ లేక, తవాజీలోని మెంబరుకాని, అల్యశాంతన వారసత్వపు సూత్రాలు వర్తించే కుటుంబము లేక కవరులోని మెంబరుగాని చనిపోయినయెడల, ఆచనిపోయినవానికి ఆతార్వాడ్, తవాజీ, కుటుంబము, కవరులలోనుండెడి ఇంటరెస్టుకు 1వ సబుసెక్షను వర్తించదు.

(4) ఏ ఆస్తిలో చనిపోయినవానికి గాని యితరవ్యక్తికిగాని, ఒక ఆఫీసుహోల్డరు, లేక ఒక ఛారిటీయొక్క లాభముపొందువాడు లేక సోల్ కార్పొరేషనుగా మాత్రమే ఇంటరెస్టు ఉండెనో అట్టి ఆస్తికి 1వ సబ్ సెక్షను వర్తించదు.

వివరణము :- సంశయములు తీర్చుటకు, ఒక స్థానం హోల్డరు ఈ సబ్ సెక్షనులోని అర్థముగల ఆఫీసుహోల్డరూ కాదు, సోల్ కార్పొరేషనూ, కాదు అని ఇందుమూలముగా డిక్లేరుచేయడమైనది.

8. చనిపోవుతలంపుతో చేసినదానములు :-చనిపోవు తలంపుతో నివ్వగా తీసుకోబడిన ఆస్తి దానమిచ్చినవాని మరణాంతమున ప్యాసైనట్లు ఎంచబడును.

వివరణము :-"చనిపోవు తలంపుతో చేసినదానము" అను మాటలకు ఇన్డియన్ సక్సెషను ఆక్టు 1925 (38 వ 1925 సంవత్సరపు ఆక్టు) 191 వ సెక్షనులోని అర్థము కలుగును.

9. మరణమునకు కొంత కాలము [illegible]సు చేసిన దానములు :- (1) ట్రాన్సుఫరు, డెలివరీ, ట్రస్టుడిక్లరేషను, వరుసగా ఒకని అనంతరం ఇంకొకరికి చేయబడిన సెటిల్మెంటుల రూపముగా గాని లేక ఇతరవిధముగ గాని వెంటనే అమలులోనికి వచ్చునట్లు, చనిపోయినవాడు చనిపోవుటకు 2 సంవత్సరములు లేక అంతకన్న ఎక్కువకాలముక్రిందట చేసినట్టిన్ని, నిజముగా సదుద్దేశముతో అట్లు చేయరానిదిన్ని అయిన అన్యాక్రాంతము క్రింద తీసుకోబడిన ఆస్తి చనిపోయినవాని మరణానంతరమున ప్యాసైనట్లెంచబడును.

ప్రజలకు దానముగా నుండు నిమిత్తము చేయబడిన దానముల విషయములో ఈ కాలము ఆరుమాసములు అగును.

(2) వివాహములకు ప్రతిఫలముగా యివ్వబడిన దానములకున్ను లేక మొత్తముమీద రు 5000- లకు మించనట్టిన్ని చనిపోయినవాని మామూలు ఖర్చులలోని భాగమని కంట్రోలరుకు తృప్తికలుగునట్లు ఋజువుచేయబడు దానములకున్ను, 1 వ సబ్ సెక్షను వర్తించదు.

**10.** ఎప్పుడు చేయబడినను ఇచ్చినవాని కెట్టి సంబంధము లేకుండచేయని దానములు:- ఎప్పుడు ఇవ్వబడినను ఏ దానముక్రిందనైనను తీసుకొనబడిన ఆస్తి, దానం పుచ్చుకొన్న వారు వెంటనే సదుద్దేశముతో నిజముగా (బోనాఫయిడీగా) స్వాధీనానుభవములు పొందకనున్న, అప్పటినుండి కంట్రాక్టువల్లగాని ఇతరత్రాగాని, దానమిచ్చినవానికి ఎట్టి స్వాధీనానుభవములు లేకుండా తానే ఉంచుకొనకుండా ఉన్నంతమట్టుకు, లేక వాని కెట్టి లాభము లేకుండ చేయనంత మట్టుకు, దానము ఇచ్చినవాని మరణానంతరము ప్యాసైనట్లెంచబడును.

కాని, మిగుల్చుకోబడిన లాభమును దరిమిలాను సరెండరు చేయుట వల్లనైనను, ఇతరత్రానైనను, దానమిచ్చినవారు చనిపోవుటకు అధమము 2 సంవత్సరములు ముందు, దానమిచ్చినవానికి ఏమీ సంబంధములేకుండా అట్టి ఆస్తి దానము పుచ్చుకొన్నవా రనుభవించుచున్న యెడల, దానము మొదలుకొని అట్లు పూర్తిగా ఉంచుకొనకపోయినంత మాత్రముచేత, అట్టి ఆస్తి ప్యాసైనట్లెంచబడదు.

**11.** మరణమునకు కొంతకాలము ముందు అన్యాక్రాంతము చేయబడిన లిమిటెడ్డు ఇంటరెస్టులు:-

(1) ఈ సెక్షనుకు లోబడి, ఒకరి మరణానంతరం అంత్యమయ్యే ఇంటరెస్టు, స్వాధీనముతో కూడినతరువాత,ప్రతిఫలయుక్తముగాగాని ప్రతిఫల శూన్యముగా గాని, అంతయుగాని కొంతగాని, సరెండరు, ఎశ్యురెన్సు, డైవెస్టింగు, ఫర్ఫీచరుల రీత్యానైనను, మరియే ఇతరరీత్యానైనను, దానంతోట అది నిర్ణయించబడిన కాలం గడచిపోవుటచేనైతే తప్ప, అన్యాక్రాంతము చేయబడినను, లేక అంతరించినను, అట్టి అన్యాక్రాంతము, లేక అంతరింపు

(లేక ఒకటికన్న ఎక్కువ ఉన్నయెడల ఏ ఒకటి అయినను) 2 వ సబ్ సెక్షనుక్రింద మినహాయించ బడితే తప్ప-

(ఎ) ఆ ఇంటరెస్టు అట్టి అన్యాక్రాంతము లేక అంతరింపు జరిగి యుండనియెడలనున్ను, అట్టి ఇంటరెస్టు వచ్చునని తలచు ఇంటరెస్టు, లేక అట్టి ఇంటరెస్టుకు లోబడిన మరియొక ఇంటరెస్టు అన్యాక్రాంతము జరిగియుండని యెడలనున్ను, అట్టి ఇంటరెస్టు ఉండియున్న ఆస్తి 5 వ సెక్షనుప్రకారం మరణానంతరం కొంతవరకు ప్యాసైనట్లే ఆ ఆస్తి ఈ సెక్షనువల్ల అంతయూ ప్యాసయే ఆస్తిలో చేరియున్న ట్లెంచబడును. లేక,

(బి) ఆ ఇంటరెస్టు ఆట్టి అన్యాక్రాంతము లేక అంతరింపు జరిగి యుండని యెడలనున్ను, అట్టి ఇంటరెస్టు వచ్చునని తలచు ఇంటరెస్టు, అట్టి ఇంటరెస్టుకు లోబడిన మరియొక ఇంటరెస్టు అన్యాక్రాంతము జరిగియుండనియెడలనున్ను, అట్టి ఇన్టరెస్టు ఉండి యున్న ఆస్తి 7 వ సెక్షను ప్రకారం మరణానంతరం కొంతవరకు ప్యాసైన ట్లెంచబడినట్లే, ఆ ఆస్తి ఈ సెక్షనువల్ల అంతమట్టుకు ప్యాసైనట్లెంచబడును.

(2) ఒకరి మరణానంతరము అంత్యమయే ఇంటరెస్టు మరణమునకు 2 సంవత్సరములకు తక్కువవాని కాలంక్రింతము, (లేక అది ప్రజలకు దానము నిమిత్తము చేయబడినదైనయెడల 6 మాసములు తక్కువకాని క్రితము) అన్యాక్రాంతము లేక అంతరింపు సదుద్దేశముతో నిజముగా (బోనాఫైడీగా) చేయబడినయెడలనున్ను,

(ఎ) అన్యాక్రాంతము లేక అంతరింపుచేయబడిన వెంటనే అన్యాక్రాంతము లేక అంతరింపుల ననుసరించి స్వాధీనానుభవములు పొంది, అదిమొదలు అన్యాక్రాంతము చేసినవారికి ఎట్టి

లాభము మిగల్చకుండా పూర్తిగా అన్యాక్రాంతము పుచ్చుకొన్నవారే ఉంచివేసుకున్నయెడలనున్ను, లేక,

(బి) కొంతవరకు మాత్రమే చేయబడిన అంతరింపు విషయములో అంతరింపుచేసినవారు కొంత ఆస్తియందు స్వాధీనానుభవములు ఉంచివేసుకొనుట చేతనైనను, లేక తమకు హక్కు కలిగిన దస్తావేజులోని షరతుల ననుసరించి కొంతలాభం ఉంచివేసుకొనుటచేత నైనను పై (ఎ) క్లాజులో చెప్పిన కండిషనులు తృప్తి కానియెడలనున్ను,

ఆ అన్యాక్రాంతము, లేక అంతరింపు యీ సబుసెక్షనువల్ల మినహాయించబడును.

కాని క్లాజు (ఎ) లో చెప్పినట్లు సదుద్దేశముతో నిజముగాం (బోనాఫైడీగా) అన్యాక్రాంతమైన వెంటనే స్వాధీనానుభవములు పొందకపోయినప్పటికిన్ని, మరణమునకు అథమము 2 సం॥ లైనను క్రితము మొదట అట్టిపెట్టుకున్న యావత్తు లాభమును అన్యాక్రాంతముచేసినవారు కంట్రాక్టుద్వారా నైనను ఇతరత్రానైనను వదలుకొనుటచేత ఆ ఆస్తి పూర్తిగా అనుభవింపబడుచున్నయెడల అట్టి అన్యాక్రాంతము లేక అంతరింపు ఈ సబ్ సెక్షను వల్ల మినహాయించబడును.

మరిన్ని 1 వ సబుసెక్షనుక్రింద చెప్పినప్రకారముగాక యితర విధముగా ఎస్టేటుడ్యూటీ ఛార్జిని యీ సబుసెక్షను తప్పించ నేరదు.

(సి) 27 వ సెక్షనులో నిర్వచించిన ఎసోసియేటెడ్ ఆపరేషనుల వల్ల పైనచెప్పిన ఇంటరెస్టు ఉండియున్న ఆస్తిమీద అట్టి ఇంటరెస్టు అన్యాక్రాంతము అయినను బాధ్యత అయినను కలుగ చేయబడిన కేసుకు 1 వ సబ్ సెక్షను వర్తింపచేయుటలో అట్టి

ఆస్తిని గురించి చెప్పినప్పుడు ఆ ఆస్తి కిమ్మతు వృద్ధిచేయు నిమిత్తం వినియోగించబడినరొఖ్ఖ లేక తత్తుల్యమైన ప్రతిఫలమునకు కలుగచేయబడిన కేసులో తప్ప, బాధ్యతలేని ఆస్తి అని చెప్పినట్లే అర్థము చేసుకోవలెను. అట్టి కేసులో మాత్రం ప్రతిఫలం అట్లు వినియోగించినంతమట్టుకు బాధ్యతకు లోబడి చెప్పినట్లే అనుకొనవలెను.

(4) ఒక మరణానంతరము అంత్యమయ్యే ఇంటరెస్టు అన్యాక్రాంతము చేయబడినప్పుడు లేక అంతరించినప్పుడు, దరిమిలాను అన్యాక్రాంతముతో సంబంధించిన ఎట్టి చర్యలవల్లనైన అన్యాక్రాంతము, లేక అంతరింపుచేసినవారు ఎంతమాత్రము లాభము పొందినప్పటికిన్ని, 2 వ సబ్ సెక్షనుక్రింద నిజమైన స్వాధీనానుభవములు పొంది అది లగాయతు పూర్తిగా ఆస్వాధీనానుభవము లుంచుకొన్నట్లు ఎంచబడదు. మరియు 2 వ సబ్ సెక్షను ప్రొవైజోక్రింద అట్టి లాభము కల్గియున్నంతవరకు అన్యాక్రాంతము లేక అంతరింపచేసినవారికి ఏమీా స్వాధీనానుభవములు లేవనికూడ ఎంచబడదు.

(5) (ఎ) 4 వ సబ్ సెక్షనులో అన్యాక్రాంతముతో సంబంధించిన చర్యలు అని చెప్పినది, అన్యాక్రాంతము ఒకటిగాగల 27 వ సెక్షను నిర్వచించిన ఎస్సోసియేటెడ్ ఆపరేషనులు అని అనుకోవలెను. మరియు,

(బి) అంతరింపులో సంబంధించిన చర్యలు అని చెప్పినది, 28 వ సెక్షను నిర్వచించిన అంతరింపుచేయు నిమిత్తము చేయబడిన ఎస్సోసియేటెడ్ ఆపరేషనులు అని అనుకొనవలెను.

**12.** మినహాలతో కూడిన సెటిల్మెంట్లు.

(1) విల్లుగా అమలులోనికిరాని ఎట్టి దస్తావేజువల్లనైనను చేయబడు సెటిల్మెంటుక్రింద ప్యానమ్యే ఆస్తియందు తనకు జీవిత

కాలపు లేక మరణమునుండి పేర్కొనబడు ఇతర కాలపు ఇంట రెస్టు రిజర్వుచేసుకొనబడినను లేక ఏ పవరు ఉపయోగించిన యెడల సెటిల్ చేసిన ఆస్తి సంపూర్ణ హక్కులతో మరల తీసకు వచ్చునో అట్టి రైటు రిజర్వుచేసికొన్న యెడలనున్ను అట్టి ఆస్తి సెటిల్మెంటుచేసిన వాని మరణానంతరము ప్యాసై నట్లెంచ బడును.

వివరణము :- సెటిల్ చేసిన ఆస్తియందు 27 వ సెక్షను ప్రకారం సెటిల్ చేసిన వాని నిమిత్తముగాని వాని బంధువులయొక్క గాని పోషణనిమిత్తం అట్టి రైటు రిజర్వుచేసుకొన్న యెడలకూడ ఈ సెక్షనుక్రింద రిజర్వేషను చేసినట్లే ఎంచబడును.

(2) 1 వ సబ్ సెక్షనులోని దానితో ఏమీ నిమిత్తంలేకుండా, ఒకరి వల్ల యింకొకరి, లేక కొందరిపేర వారి జీవితకాలములకున్ను, ఆ తరువాత సెటిల్ చేసినవారి జీవితకాలములకున్ను, ఆతరువాత ఇంకా ఇతరుల పేరనున్ను ఆస్తి సెటిల్ చేయబడినయెడలనున్ను, సెటిల్ చేసిన వాని ఇంటరెస్టు స్వాధీనము కూడినది కాకపూర్వమే సెటిల్ చేసినవారు మరణించిన యెడలనున్ను, ఈ సెక్షను లో చెప్పినవిధముగా సెటిల్ చేసిన వాని మరణానంతరం అట్టి ఆస్తి ప్యాసైనట్లెంచబడదు.

**13.** జాయింటు ఇన్వెస్ట్మెంట్లు:—

ఎవరైనను ఏ ఆస్తియందైనను, లేక ఆ ఆస్తికొన్న డబ్బుయందైనను సంపూర్ణ హక్కు కలిగియుండి, ఆ ఆస్తిలో కొంత యందు లాభకరమైన ఇంటరెస్టు తన మరణానంతరము ఇతరులకు సంక్రమించేటట్లుగా తాను, లేక తాను అట్టి యితరులున్ను కలసి, తన పేరనున్ను లేక తనపేర, ఇతిరులపేర కలసిన్ని జాయింటుగా ట్రాన్సఫరు లేక వెస్టు అయేటట్లు చేసినయెడల, అట్టి యావదాస్తి వాని మరణానంతరము ప్యాసైనట్లెంచ బడును.

**14.** దానము పుచ్చుకొనువారి నిమిత్తము నిలబెట్టిన పోలసీలు :—

(1) ఎవరైనను ఒక జీవితమును భీమాచేయించి తానిచ్చిన దానము పొందిన వాని లాభము నిమిత్తము భీమా వాయిదాలుసొమ్ము కట్టుచు నిలబెట్టినయెడల, అట్టి భీమావల్ల వచ్చే యావత్తు సొమ్మున్ను లేదా కొన్ని వాయిదాలసొమ్ముకు ప్రపోర్షనేటుగా ఉండే పోలసీవల్ల వచ్చేసొమ్ములోని భాగము, అట్టి భీమా చేయించినవాని మరణానంతరము ప్యాసైన ట్లెంచబడును.

వివరణము :—

మరణించినవారు చేసిన సెటిల్మెంటు ననుసరించి వారి జీవితమును మరొకరు భీమాచేయించినయెడల ఆ పోలసీ అతడే భీమా చేయించిన ట్లెంచబడును.

(2) 1 వ సబ్ సెక్షను నిమిత్తము మరణించినవారు ఆస్తి సెటిల్ చేసిన కారణముచేత, సెటిల్మెంటులో ఏర్పాటుచేసినను చేయక పోయినను సెటిల్ చేసిన ఆస్తివల్లగాని అందలి ఆదాయమువల్ల గాని ఎంతవరకు భీమావాయిదాలు చెల్లించబడునో, అంత మట్టుకు వాయిదాలసొమ్ము మరణించినవారే కట్టినట్లెంచ బడును.

కాని సెటిల్మెంటు నిమిత్తము డైరెక్టుగానైనను, సెటిల్డు ఆస్తి వల్లగాని, దానిని మార్చిన ఆస్తివల్లగాని, అందలి ఆదాయము వల్లగాని, లేక మరణించినవారు ఇవ్వమని ఏర్పాటు చేసిన అట్టి ఆస్తి ఆదాయమువల్లగాని యివ్వబడిన సొమ్ములు మరణించినవారికిన్ని, ఇతరులకున్ను మధ్యజరిగిన అన్యోన్య ఏర్పాట్లవల్ల యివ్వబడలేదని కంట్రోలరును తృప్తిపరచేయెడల మరణించినవా రిచ్చినసొమ్ములుగా భావింపబడవు.

**3.** ఈ సబ్ సెక్షను నిమిత్తము :—

(ఎ) (సెటిల్మెంటు అనే పదములో ట్రిస్టు, షరతు (కవనెంటు) అగ్రిమెంటు, అరేంజిమెంటు లేక అన్యాక్రాంతము కూడి యుండును. మరిన్ని,

(బి) ఒకరు డైరెక్టుగా నైనను ఇన్ డైరెక్టుగా నైనను సెటిల్మెంటు చేసిననూ లేక ముఖ్యముగా (ఈ క్లాజులోని మాటల అర్థము చెడకుండునట్లు) సెటిల్మెంటు నిమిత్తము సొమ్ము ఇచ్చినను, లేక సెటిల్మెంటు నిమిత్తము సొమ్ము ఇచ్చుటకు పూచీపడి నను లేక మరి యే యితరులతోనైనను అట్టి సెటిల్మెంటు ఆ యితరులు చేయుటకు ఏర్పరచినను అట్టి వ్యక్తి సెటిల్మెం టు చేసినట్లే ఎంచబడును.

**15.** చనిపోయినవాడు కొన్న లేక ఏర్పరచిన ఏన్యుయిటీ లేక యితర ఇంటరెస్టు:-

తాను స్వంతముగా నైనను లేక ఇంకొకరితో అరేంజి చేసు కొనియైనను ఏర్పరచిన లేక కొన్న ఏన్యుయిటీ లేక ఇతర ఇంటరెస్టు, వాని మరణానంతరము సర్వాయివరుషిప్పువల్లగాని యితరత్రాగాని వచ్చులాభపు ఇంటరెస్టుమట్టుకు ప్యాసైన ట్లెంచబడును.

వివరణము :—

మరణమునకు ముందు (బెనిఫిషియరీ) లాభము పొందినవానికి ఉండియుండెడి వచ్చువని తలచు ఇంటరెస్టు వదలివేసియే లాభ పు ఇంటరెస్టు పరిమితి నిర్ణయించవలెను.

**16.** చనిపోయిన వారి వద్దనుండివచ్చిన ఆస్తిలోనుండి ఏర్పరచిన లేక కొన్న ఏన్యుయిటీ లేక యితర ఇంటరెస్టు.

(1) ఎవరైనను, ఎప్పుడైనను చనిపోయిన వానివద్దనుండి వచ్చిన ఏ ఆస్తియందైనను హక్కు గలిగియుండి, లేక ఎవరి సొత్తులలో నైనను, చనిపోయినవారి ఆస్తి ఏమయినను కలసియుండి, ఒక

ఏన్యుయిటీనిగాని యితర ఇంటరెస్టునుగాని పూర్తిగానైనను కొంత అయినను, కొన్ననూ లేక ఏర్పాటుచేసిననూ, అట్టి ఏన్యుయిటీ లేక ఇతర ఇంటరెస్టు ఆ మరణించినవాడే ఏర్పాటు చేసినట్లు 15 వ సెక్షను వర్తించును. లేదా, అట్టి చనిపోయిన వాని వద్దనుండి వచ్చిన ఆస్తి అంతయూ కూడ ఏన్యుయిటీ మొత్తము చెల్లించుటకు చాలదని కంట్రోలరుకు తృప్తికలిగే లాగున ఋజుచేసినయెడల అప్పుడు ఆ సరిపోవని ఋజువుచేయ బడిన భాగమునకు ప్రపోర్షనులో తగ్గించిన ఏన్యుయిటీ మొత్త మునకు మాత్రమే చనిపోయినవారు ఏర్పరచిన ఏన్యుయిటీ లాగున 15 వ సెక్షను వర్తించును.

కాని,పైన చెప్పినట్టి చనిపోయినవానివద్దనుండి వచ్చిన ఆస్తి ఏన్యుయిటీ చెల్లించుటకు సరిపోవునా లేదా; ఎంతలోటు వచ్చును అను విషయములు నిర్ణయించుటకు మరణించినవాని వద్దనుండి వచ్చిన ఆస్తిలోనుండి ఆ ఆస్తిలోని ఏ భాగమును గురించి చేయబడిన అన్యాక్రాంతము, ఏన్యుయిటీ లేక యితర ఇంటరెస్టును కోరుటకు లేక ఏర్పాటుచేయుటకు తోడ్పడు ఉద్దేశముతో చేయబడలేదనియు లేక అట్టి ఆస్తి కిమ్మతు తిరిగి ఇచ్చివేయు ఉద్దేశములేదనియు కంట్రోలరుకు తృప్తికలిగేటట్లు ఋజువుచేయకలుగునో అట్టి భాగము ఆస్తి మినహాయించ వలెను.

(2) ఈ సెక్షనులోని ఈ క్రిందిపదములకు ఈదిగువ అర్థము లుండును.

(ఎ) "మరణించినవాని వద్దనుంచి వచ్చిన ఆస్తి" అనగా మర ణించినవాని స్వంత ఉపయోగం నిమిత్తం యివ్వబడిన రొఖ్ఖం లేక తత్తుల్యప్రతిఫలంతో అన్యాక్రాంతము చేయ బడిన ఆస్తి; లేక, అట్టి ఆస్తినుండి మారి మరియొక రూపము

దాల్చిన ఆస్తికాకుండా, మరణించినవారు స్వంతముగనైనను ఇతరులతో కలసినైనను అన్యాక్రాంతముచేసిన ఆస్తిన్నీ, ఒకవేళ అట్టిదిగాక యింకా కొన్ని దర్మిలా అన్యాక్రాంతములు చేయబడియున్నయెడల వాటి కన్నిటికీ ప్రతిఫలం ఉన్ననుసరే లేకపోయినను సరే అట్టి అన్యాక్రాంతము చేయబడిన ఆస్తి.

కాని, మొదటి అన్యాక్రాంతమునకు పూర్తియైన రొఖ ప్రతిఫలం ఉండి, మరియు అట్టి అన్యాక్రాంతము ఎస్సోసియేటెడ్ ఆపరేషనులలోని భాగముకాదనియు కంట్రోలరుకు తృప్తికలిగే లాగున ఋజువుచేసిన యెడలనున్ను, ఆఎస్సోసియేటెడ్ ఆపరేషనులలో,

(ఎ) స్వంతముగానైనను ఇంకొకరితో కలసినైనను తన స్వంత ఉపయోగము నిమిత్తము యివ్వబడిన రొఖః లేక తత్తుల్య ప్రతిఫలం లేకుండినట్టి ఇతర అన్యాక్రాంతమున్ను' లేక,

(బి) ఇతరులెవరైనను మరణించినవాని ఆస్తియొక్క విలువను తగ్గించునట్లు చేసిన అన్యాక్రాంతమున్ను, కూడియున్న యెడల, అప్పుడు ఎస్టేటుడ్యూటీ చెల్లించవలెనో అక్కర లేదో అని యోచించుటలో మొదటి అన్యాక్రాంతమును ఈ ప్రొవిసను వర్తించనట్లుగా వదలివేయవలెను.

(బి) "అన్యాక్రాంతము"లో ట్రస్టు, షరతు అగ్రిమెంటులేక అరేంజి మెంటు అనునవి కూడియుండును.

(సి) "అన్యాక్రాంతము చేయబడిన" అను దానిలో అన్యాక్రాంతమువల్ల ప్రతి సంవత్సరముగాని, కొంతకాలమున కొకసారిగాని ఇచ్చిన లేక ఇవ్వవలసిన వసూలుకూడ చేరియుండును.

(డి) ఈ సెక్షక్రింద మరణానంతరం ప్యాసయే ఆస్తిలో చేరు ఆస్తి యందు మరణించినవానికి 34 వ సెక్షను నిమిత్తం ఇంటరెస్టు ఉన్నట్లెంచబడును.

కంపెనీలపేర ట్రాన్స్‌ఫర్లకు సంబంధించిన ప్రొవిజనులు :

**17.** కంట్రోల్డు కంపెనీకి ట్రాన్స్‌ఫరు చేయబడిన అస్తి :

(1) మరణించినవాడు కంట్రోల్డు కంపెనీకి (తన మరణానంతరం హక్కు అంతరించునట్టిదిగాని, లేక నమ్మకముతో కూడినపదవి (ఫిడ్యూషియరీ కెపేసిటీ) లో ట్రాన్స్‌ఫరుచేసినది కాని గాక, ఎట్టి ఆస్తినైనను ట్రాన్స్‌ఫరుచేసినయెడలనున్ను, అట్టి కంపెనీనుండి మరణించినవానికి మరణముతో అంత్యమయే మూడు సంవత్స రములలోను లాభము వచ్చియున్నయెడలనున్ను ఎస్టేటుడ్యూటీ నిమిత్తము 2 వ సబుసెక్షనుప్రకారం నిర్ణయించబడునంత పట్టుకు కంపెనీ ఎస్సెట్లు వాని మరణానంతరము ప్యాసయే ఆస్తిలో చేరియున్న ట్లెంచబడును,

(2) ప్యాసయే ఆస్తిలో చేరియుండు నట్లెంచబడు కంపెనీ ఎసెట్ల పరిమితి, చనిపోయినవానికి గత మూడు సంవత్సరములలోను వచ్చిన మొత్తము లాభమునకున్ను ఆమూడుసంవత్సరములలోను కంపెనీకి వచ్చిన మొత్తము రాబడికిన్ని ఉండు ప్రపోర్షనులో కంపెనీ ఎసెట్లు అగును.

కాని,

(ఎ) మూడు ఎక్కవుంటింగు సంవత్సరములలోను ఏ సంవత్సర ములో నైనను కంపెనీ నష్టపడినప్పుడు మూడు సంవత్సర ములు మొత్తం రాబడిలోను ఆ నష్టము తీసివేయవలెను.

(బి) కంపెనీ ఆ మూడింటిలోను 2 వ సంవత్సరంలో స్థాపితమైన యెడల "2 సంవత్సరములు" అనియు, 3 వ సంవత్సరము లో స్థాపితమైనయెడల "1 సంవత్సర" మనియు ఈ సబ్ సెక్షనులో నున్నట్లు చదువవలెను.

(3) మొదటి ఎక్కవుంటింగు సంవత్సరం ప్రారంభమునకున్ను, మర ణమునకున్ను మధ్యకాలములో ఎప్పుడైనను (ఎ) కంపెనీ షేర్లు, డిబెంచర్లకు సంబంధించిన రైట్లు తృప్తిపరచుటకున్ను,

(బి) కంపెనీ స్వంత ఉపయోగలాభముల నిమిత్తము రొఖ లేక తత్తుల్య ప్రతిఫలమునకున్ను, చట్టపుపన్నులు, బాధ్యతలకున్ను, ఇచ్చుకోవలసిన నష్టపరిహారములకున్ను, కంపెనీ ఎత్తి వేయుటలో చేసినవికాక, ఇతర విధముగాను అన్యాక్రాంతము చేయబడిన లేక పంచియిచ్చిన కంపెనీయొక్క ఎసెట్లు మరణానంతరము ఈ సెక్షను ప్రకారము పాసయే ఎసెట్లలో చేరి యుండును.

కాని, అక్కవుంటింగు సంవత్సరములో గాని అక్కవుంటింగు సంవత్సరం ఆఖరుకున్ను మరణమునకున్ను మధ్యకాలములో గాని కంపెనీకి వచ్చు ఆదాయమును మించకుండునంత మట్టుకు ఇన్ కంటాక్సు మినహాయించదగిన లేక విధించదగిన కంపెనీ అన్యాకాంతము చేసిన లేక పంచియిచ్చిన ఎసెట్లకు యీ సబ్ సెక్షను వర్తించదు.

(4) (i) కావలసిన ఎప్పుడైనను 5 గురకు మించనివారి కంట్రోలులో ఉన్నట్టి, లేక ఈ ప్రొవిజనులు ఎల్లప్పుడు అమలులోనున్న పక్షమున ఉన్నట్లెంచబడునట్టిన్నీ, ఒక కంపెనీలో కంపెనీ (సబ్ సీడియరీకంపెనీ) గానట్టిన్నీ లేక పబ్లిక్కుకు అంతగా ఇంటరెస్టు లేనట్టిన్నీ ఏ కంపెనీ అయినను "కంట్రోల్డు కంపెనీ" అగును.

వివరణము:—ఈ సబ్ సెక్షను నిముత్తము:-

(ఎ) ఒక కంపెనీయొక్క షేర్లలాభపు హక్కు ఉండుటవల్ల ఆకంపెనీ ఈ సబ్ సెక్షను వర్తించని మరియొక కంపెనీ ఆదీనము (కంటో్రలు) లో వున్నయెడల, అట్లు కంట్రోలు చేయబడునది కంటో్రల్డు కంపెనీగా నెంచబడును.

(బి) నూటికి 25 తక్కువకాని వోటింగు పవరుకలిగియున్న షేర్లు పబ్లిక్కుకు ఏ విధమైన షరతులు లేకుండగా ఎలాటుచేసి

యున్నట్టి, లేక సంవత్సరం ఆఖరుకు లేక అక్కవుంటు పూర్తి చేసిన ఇతరకాలమునకు, అట్టి షేర్లు పబ్లిక్కు కలిగియున్నట్టిన్నీ లేక సంపాదించినట్టిన్నీ ఆ సంవత్సరం లేక యితర కాలములో స్టాకు మారకం వ్యాపారంలో ఉపయోగించినట్టిగాని, ఇతర పబ్లిక్కు మెంబర్లకు స్వేచ్ఛగా ట్రాన్స్ఫరు చెయకలిగినట్టిగాని షేర్లుగల కంపెనీయే "పబ్లిక్కుకు ఎక్కువ ఇంటరెస్టుగల కంపెనీ"గా ఎంచబడును.

(ii) (ఎ) కంపెనీయొక్క వ్యాపారములలో డైరెక్టుగా నైనను లేక ఇన్‌డైరెక్టుగా నైనను 5 గురు గాని అంతకు తక్కువమంది గాని కలసి కంట్రోలు చేయునప్పుడున్ను, లేక చేయగలప్పుడున్ను, ముఖ్యముగా 5 గురు గాని అంతకు తక్కువ మందిగాని కలసి షేరుకేపిటల్‌లోని ఎక్కువ భాగమును గాని ఓటింగు పవరునుగాని కలిగియుండునట్టిన్నీ లేక సంపాదించుటకు హక్కుకలిగి యుండునట్టిన్నీ కంపెనీ లేక,

(బి) కంపెనీ ఇస్యూచేసిన షేరుకేపిటల్‌లో ఎక్కువ భాగము గాని, లేక కంపెనీయొక్క యావత్తు రాబడి మెంబర్లకు పంచిపెట్టినయెడల ఆ పంపకపు సొమ్ములో ఎక్కువ భాగము గాని 5 గురు లేక అంతకన్న తక్కువమంది కలసిపుచ్చుకొనుటకు హక్కు కలిగియుండు కంపెనీ. లేక,

(సి) (i) ఒక కంపెనీకి యీ సబుసెక్షను వర్తించుననుకొన్నయెడల, లేక,

(ii) ఒక కంపెనీకిన్నీ యింకొక కంపెనీ లేక కంపెనీలకున్ను యీ సబ్‌సెక్షను వర్తించుననుకొన్నయెడలనున్ను,

ఆ కంపెనీయొక్క రాబడిలో సగముకు మించినరాబడి, దానికి యివ్వ నిర్ణయమైనట్టి లేక యిచ్చుట కవకాశము గల రాబడితో సహా, 5 గురకు తక్కువకాని మందికి ఇవ్వ

నిర్ణయించగల కంపెనీయున్ను 5 గురు కన్న ఎక్కువకాని మంది కంట్రోలులో నున్న కంపెనీగా ఎంచబడును.

(4) (iii) ఒక కంపెనీ 5 గురు కన్న ఎక్కువకానిమంది కంట్రోలులో ఉన్నదీ లేనిదీ స్థిరపరచుటలో ఒకరితో నొకరికి బంధుత్వముగలవారి నందరినిన్ని, ఒకరి నామినీలున్ను ఆ ఒకరిని న్ని పార్టనర్లనున్ను, ఒక ట్రస్టులో నున్న లేక చనిపోయిన వాని ఎస్టేటులో భాగమైన కంపెనీ షేర్లలోను, బాధ్యతలోను ఇంటరెస్టుగలవారినిన్ని, వరుసగా ఒక్కొక్క వ్యక్తిగానే ఎంచబడును.

వివరణము:—ఈ క్లాజు నిమిత్తము:-

(ఎ) బంధువులు అనగా, భార్య, భర్త, పూర్వపువారసు, దిగ్గిలావార్సు, సోదరసోదరీలున్ను,

(బి) ఈ సబ్ సెక్షనులోని ఏ ప్రొవిజనుల ప్రకారమైనను 5 గురకు ఎక్కువకానిమంది కంట్రోలులో ఒక కంపెనీ ఉన్నదీలేనిదీ నిర్ణయించుటకు ముఖ్యమైన ఏరైటు లేక పవరునైనను డైరెక్టుగానైనను ఇన్‌డైరెక్టుగానైనను ఇంకొకరి తరఫున కలిగియున్నట్టిన్ని లేక ఆ ఇంకొకరు కావలయునన్నపుడు చెలాయించవలసి వచ్చునట్టిన్ని వారు ఆ ఇంకొకరి తరఫున "నామినీలు" గా ఎంచబడుదురు.

(iv) ఒక ఇన్వెస్టుమెంటుకంపెనీ ఎత్తివేయు (వైండప్ చేయు)నెడల దానియొక్క ఎసెట్లలో దాని బాకీదారులకున్ను, మెంబర్లకున్ను పంచి యివ్వవలసి యుండు సఖముకంటె ఎక్కువ ఎసెట్లు ఆ కంపెనీలోని ఏ అయిదుగురుకాని అంతకన్న తక్కువమందిగాని మెంబర్లు ఆ కంపెనీ బాకీదార్లుగా పుచ్చుకొనుటకు రైటుకలిగి యుండునెడల అట్టి కంపెనీ 5 గురు కన్న మించనివారి కంట్రోలులో నున్నట్లెంచబడును.

(v) 1 వ క్లాజులో చెప్పియున్న దేనితోను నిమిత్తములేకుండ గా: 5 గురిని మించనిమంది కంట్రోలులోనున్న ఎంచబడు కంపెనీ, (ii) వ క్లాజు (ఎ), (బి), లేక (సి) లేక, (iv) సబుక్లాజులలో చెప్పినవారిలో (i) వ సబుక్లాజు వర్తించ నట్టిన్నీ ఎవరికిన్నీ నామినీ కానట్టిన్నీ ఒక కంపెనీ కూడి యుండనిచో అట్టిది సబ్ సీడియరీ కంపెనీగా ఎంచబడదు.

(vi) ఈ సబుసెక్షనులో "ముఖ్యమైనకాలము" (Relevant period) అనగా అన్యాక్రాంతము చేయబడినది లగాయతు చనిపోయినవరకు గల మధ్యకాలములో, ఏ కాలము అయిననూ, లేక ఈఅట్టి నిమిత్తము ముఖ్యమైన(Relevant) కాలము లేక ఎస్సోసియేటెడ్డు ఆపరేషనులలో అన్యాక్రాంతము ఒకటి అయినయెడల అందలి ప్రథమ ఆపరేషను జరిగిన కాలము.

(5) 34 వ సెక్షను నిమిత్తము యీ సెక్షను ప్రకారము ప్యాసైన ఎంచబడే ఆస్తియందు ఇంటరెస్టు చనిపోయినవాడు కలిగి యున్న ఎంచబడును.

**18.** ట్రాన్స్ఫరు చేసినవారి మరణానంతరము కంట్రోలరుకు సమాచారము యిచ్చుటకు కంపెనీయొక్కయు, కంపెనీ ఆఫీసర్లయొక్కయు డ్యూటీ:—

(1) చనిపోయిన అసామీ ఒక కంపెనీకి ఆస్తి ట్రాన్స్ఫరుచేసినప్పుడు, చనిపోయిన 45 రోజులు లోపున చనిపోయినసంగతిన్నీ, చనిపోయిన అసామీ కంపెనీకి ఆస్తి ట్రాన్స్ఫరుచేసిన సంగతిన్నీ, కంపెనీలో నుంచి చనిపోయినవానికి లాభం కలిగిన సంగతిన్నీ కంట్రోలరుకు తెలుపుటకు కంపెనీ బాధ్యత కలిగి యున్నది. మరియు, కంపెనీయొక్క ముఖ్యోద్యోగియున్ను, కంపెనీ ఎత్తివేయబడినయెడల, కంపెనీలో అదివర కెప్పుడైనను ముఖ్యోద్యోగిగా పనిచేసినవారున్ను, అదివరకే కంపెనీవారు

గాని, యితరులు గాని సమాచారము ఇచ్చినట్లెరిగి యుంటే నున్ను లేక ఇచ్చియున్నట్లు నమ్మియుంటేనున్ను తప్ప, వారికి తెలిసినంతవరకు పై సమాచారమును కంట్రోలరుకు తెలుపుటకు బాధ్యులై యుందురు.

(2) 1 వ సబ్ సెక్షను క్రింద సమాచారమిచ్చుటకు బాధ్యత కలిగి యున్నవారు, అట్టి సమాచారము తెలుపుటకు తప్పిపోయిన యెడల అట్టి తప్పిదముచేసిన (డిఫాల్టరు) వారిమీద కంట్రోలరు రు 1000- కు మించకుండా అపరాధపు జరిమానా విధింప వచ్చును.

వివరణము: ఈ సెక్షను నిమిత్తము 'ముఖ్యోద్యోగి' అనగా మేనేజరు, ఏజెంటు, లేక సెక్రటరీయున్ను, కంపెనీతో సంబంధించినట్టిన్నీ, ముఖ్యోద్యోగిగా ఎంచి కంట్రోలరు ఈ సెక్షను క్రింద నోటీసు అమలుజరిపినట్టిన్నీ ఎవరైననుకూడ అయి వుందురు.

**19.** 17 వ సెక్షనుక్రింది డ్యూటీనిర్ణయము, వసూలు :

(1) ఒకరు చనిపోయినప్పుడు 17 వ సెక్షనుక్రింద చెల్లించవలసిన డ్యూటీకి సమాధానము చెప్పుటకు ఈ దిగువవారు బాధ్యులై యుందురు:

(ఎ) కంపెనీ;

(బి) కంపెనీయొక్క స్వంత ఉపయోగలాభముల నిమిత్తము ఇవ్వబడిన సొత్తు లేక తత్తుల్య ప్రతిఫలమునకు క్రియము పొందినవారు తప్ప, కంపెనీనుంచి డైరెక్టుగానైనను ఇండైరెక్టుగా నైనను, కంపెనీకి ఉన్న మూలధనము లేక రాబడిని పుచ్చుకొను లేక అన్యాక్రాంతము చేయువ్యక్తి.

(2) పంపకము చేయబడిన ఎసెట్లను పుచ్చుకున్న ఎవరైననూ, కాని (i) 1 వ క్లాజు (బి) సబ్ క్లాజు ప్రకారం వారు పుచ్చు

కున్న ఎసెట్లయొక్క కిమ్మతుకు మించిన్నీ, (ii) క్లాజు (సి) ప్రకారము పంపకము చేయబడిన ఎసెట్ల కిమ్మతుకున్ను, 17 వ సెక్షను ప్రకారము మరణానంతరము ప్యాసయే ఎసెట్ల అసలు కిమ్మతుకున్ను ఉండే ప్రపోర్షనులో మొత్తం డ్యూటీలోని ప్రపోర్షను గల డ్యూటీభాగమును మించిన ఎసెట్లకున్ను, ఎవరూ జమాఖర్చు చెప్పుటకు బాధ్యులు కారు.

వివరణము: యీ సెక్షను నిమిత్తము 'చనిపోయిన మీాదట ప్యాసయే పంపకపు ఎసెట్ల'లో, చనిపోయినవారు కంపెనీ చేసిన పంపకములో పుచ్చుకున్న ఏ పంపకపు ఎసెట్లు చేరవు. మరిన్నీ, చనిపోయినవానికంటె ముందు పంపకపు ఎసెట్లను పుచ్చుకున్నవారు మరణించినయెడల ఆ ముందు చనిపోయిన వారే (సి) క్లాజు ప్రకారము ఎక్కవుంటు చెప్పుటకు బాధ్యులు.

(2) ఈ ఆక్టు అమలులో నున్న ప్రదేశములు గాక ఇతర ప్రదేశములలో ఇన్కార్పొరేటు అయిన కంపెనీ, పై సబుసెక్షను ప్రకారము డ్యూటీకి ఎక్కవుంటు చెప్పుటకు బాధ్యతకలదైనయెడల, మరణకాలమునకు ఆ కంపెనీలోని ప్రతీమెంబరు కూడా ఆకంపెనీలో తనకుగల ఇంటరెస్టుకు ప్రపోర్షనులో ఆ డ్యూటీలోని భాగమునకు ఎక్కవుంటు చెప్పుటకు బాధ్యుడు.

(3) ఈ సెక్షను ప్రకారం ఏ డ్యూటీకైనను బాధ్యుడైనవాడు అట్టి డ్యూటీని రాబట్టి చెల్లించుటకు ఎక్కవుంటు చెప్పవలసినవారి కెల్లరకు ఉండే అధికారములు కలిగియుండును.

(4) కంపెనీ ఎత్తివేయునపుడు ఇన్డియన్ కంపెనీల ఆక్టు (1913 వ VII వ ఆక్టు) 230 వ సెక్షను క్లాజు (ఎ) లో ఈ ఆక్టు 16 వ సెక్షను ప్రకారము మరణానంతరము ప్యాసయేకంపెనీ ఎసెట్లను ఉదహరించియున్నట్లెంచి వర్తించును. ఆ ప్రకారమే కంపెనీల ఆక్టు 129 వ సెక్షను కూడా వర్తించును.

(5) 17 వ సెక్షను ప్రకారము మరణానంతరమున చెల్లించవలసిన డ్యూటీ మరణకాలమునకు కంపెనీకి ఉండునట్టిన్నీ, ఎసెట్ల మీాద తేలుదలహామీా (Floating security) రూపకమైన ప్రథమ హామీా కలిగియుండును. మరిన్నీ, 1 వ సబ్ సెక్షను క్లాజు (సి) ప్రకారము డ్యూటీలో ఏ భాగమునకైనను, ఎవరైనను పంపకపు ఎసెట్లకు జమాఖర్చు చెప్పుటకు బాధ్యులైనయెడల అట్టి డ్యూటీకూడా అట్టి ఎసెట్లమీాద ప్రథమ హామీా కలిగియుండును. కాని, సరియైన ప్రతిఫలమునకు క్రియము పొందిన ఆస్తిపైన యీా సబ్ సెక్షనులోనిదేదిన్నీ పని చేయదు.

(6) ఏ డ్యూటీ అయినను,

(ఎ) 1 వ సబ్ సెక్షను క్లాజు (బి) వలన మాత్రముననే జమాఖర్చు చెప్ప బాధ్యతగల ఎవరిచేనైనను చెల్లించబడినను,

(బి) 5 వ సబ్ సెక్షనువలన డ్యూటీకి హామీా ఉన్న పంపకపు ఎసెట్లనుంచి ఎత్తి తీయబడినను, ఆవ్యక్తి లేక హామీాతో కూడియున్న ఎసెట్లకు హక్కు కలిగి యున్నవ్యక్తి (యీా సబ్ సెక్షను కాకుండా ఇతర లా ప్రకారము కంట్రిబ్యూషనుకు లేక నష్టమునకు కలిగియుండే హక్కుకు భంగము లేని పద్ధతిని) అట్లు చెల్లించిన లేక, ఎత్తితీసిన డ్యూటీని క్లాజు (సి) ప్రకారము కాకుండా ఇతర విధముగా అట్టి డ్యూటీకి జవాబుదారీగల ఎవరివల్లనైనా రాబట్టుకోవచ్చును.

(7) కంపెనీ చెల్లించిన డ్యూటీలో ఏ భాగమున్ను చనిపోయినవాని మరణమునకు కంపెనీకి గల ఎసెట్లయందు ఎట్టి ఇంటరెస్టు అయినను ఉన్నట్టిన్నీ లేక ఎసెట్లపై హామీా కలిగినట్టిన్నీ కారణముచేత ఎవరివల్లను కంపెనీ రాబట్టుకొన వీలులేదు.

(8) 53 వ సెక్షను 1,3 సబుసెక్షనులు 17 వ సెక్షను ప్రకారము చెల్లించవలసిన డ్యూటీకి సంబంధించినంతవరకు వర్తించవు.

**20.** కంట్రోల్డు కంపెనీలను గురించి సామాన్యముగా నిబంధనలు చేయుట కధికారము :

(1) బోర్డువారీ క్రింది నిబంధనలను చేయవచ్చును.

(ఎ) 17 వ సెక్షను ప్రకారము కంట్రోల్డు కంపెనీలకు ట్రాన్సఫర్లు చేసినట్లెంచదగిన అన్యాక్రాంతములు లేక ఆపరేషనుల తరగతులను నిర్ణయించుటకున్ను,

(బి) అట్టి కంట్రోల్డు కంపెనీనుంచి చనిపోయినవానికి లాభములు కల్గినట్లెంచదగిన విషయములను గురించిన్ని, ఎంతవరకు లాభము కలిగినదో అట్టి మొత్తములను ఎట్లు నిర్ణయించవలెనో అట్టి విధములను గురించిన్ని, ఏ కాలమునకు అట్టి లాభములు కలిగినవో నిర్ణయించుటకున్ను,

(సి) అట్టి కంపెనీయొక్క నికరాదాయమున్ను ఎసెట్లకిమ్మతున్ను నిర్ణయించే మాదిరిని గురించిన్ని,

(డి) అట్టి ఏ కంపెనీకైనను ఎక్కవుంటింగు సంవత్సరం ఎట్లు నిర్ణయించవలెనో అట్టి మాదిరిని గురించిన్ని,

(ఇ) మరణానంతరము ప్యాసయ్యే కంపెనీయొక్క షేర్లు డిబెంచర్లు కిమ్మతుకట్టే విధానమును గురించిన్ని,

(ఎఫ్) చనిపోయినవాడు అట్టి కంపెనీకి ట్రాన్సఫరుచేసినట్టిన్ని అందువల్ల వేరువేరు విధములుగా కంపెనీ ఎసెట్లమీదనున్ను, చనిపోయినవాడు కల్గియున్న షేర్లు డిబెంచర్లమీదనున్ను డ్యూటీ విధించుట తటస్థించకుండుటకు పై లిమిట్టు నిర్ణయించుటకున్ను,

(జి) కంపెనీపేర చేయబడిన వ్యాపారములు ఏ కండిషనులపైన ఎంతమట్టుకు న్యాయమైనట్టిన్ని నిజమైనట్టిన్ని వ్యాపారములని ఎంచబడునో నిర్ణయించుటను గురించిన్ని,

(హెచ్) సామాన్యముగా కంపెనీల ద్వారా ఎస్టేటు డ్యూటీలనుండి తప్పించుకొనుట చెక్కుచేయుటకున్ను,

(2) ఈ సెక్షనుక్రింద చేయబడిన అన్ని నిబంధనలున్ను ప్రజాసభ భవనములో ఆఖరి పబ్లికేషనుకు అధమము 15 రోజులు ముందుగా ఉంచబడవలెను.

3 వ భాగము. డ్యూటీఛార్జి అక్కరలేకపోవుట.

**21.** దేశాంతర ఆస్తి. మరణానంతరము ప్యాసయే ఆస్తిలో ఈదిగువవి చేరవు.

(ఎ) ఈ ఆక్టు అమలులో నున్న ప్రదేశములు గాక ఇతర దేశములలో నున్న స్థిరాస్తి.

(బి) (i) ఏ ఆస్తికైనను, సెటిల్ అయినను కాకపోయినను, మరణకాలమునకు మరణించినవారు విదేశములలో నివాసము కలిగియున్నను, లేక,

(ii) సెటిల్ అయిన ఆస్తికి మరణించినవారు జీవితకాలపు హక్కుదారై, సెటిల్మెంటు అమలులోనికి వచ్చేసరికి సెటిల్ చేసినవారు అట్టి విదేశములలో నివసించుచున్నను, తప్ప, మరణకాలమునకు ఈ ఆక్టు వ్యాపించియుండు ప్రదేశములకు బైట ఉన్న చరాస్తి.

(2) ఈ సెక్షను నిమిత్తము వివిధ తరగతుల ఆస్తులు ఎచ్చట నున్నదీ, ఏ రకమువి అయినదీ నిర్ణయించుటకు బోర్డు నిబంధనలు చేయవచ్చును.

**22.** చనిపోయినవాడు ట్రస్టీగా ఉంచుకొన్న ఆస్తి :

మరణించినవాడు చేయని అన్యాక్రాంతమువల్లనైనను, లేక అతడే చేసిన అన్యాక్రాంతము అయి, అందు మూలమున నైనను లేక దరిమిలా కంట్రాక్టు మూలముననైనను, ఇతరత్రానైనను, తాను మొదట ఉంచుకొనియున్న లాభమును వదలుకొన్నందున, అతని మరణమునకు అధమము 2 సంవత్సరముల

క్రితము అట్టి ఆస్తి స్వాధీనానుభవములు పూర్తిగా పొంది, అది లగాయతు కలిగియున్నయెడల అట్టి అతని అన్యాక్రాంతము వల్లనైనను పుట్టిన ట్రస్టు ఆస్తి మరణానంతరం ప్యాసయే ఆస్తిలో చేరదు.

కాని, తానే చేసిన అన్యాక్రాంతమువల్ల ఇంకొకరికి ట్రస్టీగా మేనేజిచేయుచున్న ఆస్తి విషయములో పై కాలము 5 సంవత్సరములు ఉండును.

**23.** స్వాధీనముతో కూడిన యింటరెస్టు అగుటకు పూర్వం చెడిపోయిన యింటరెస్టు :

సెటిల్ చేసిన ఆస్తి విషయములో సెటిల్ చేయబడిన ఇంటరెస్టు ఎవరికి సెటిల్ చేయబడెనో వారు (సెట్లీ) చనిపోవుటచే, స్వాధీనముతో కూడిన ఇంటరెస్టు కాకముందే ఆఖరైనను, అంతరించినను, సెటిల్మెంటు రీత్యా, ఇంకా కొన్ని లిమిటేషనులు జరుగవలసియున్నప్పుడు అట్టి ఆస్తి, అట్టి ఇంటరెస్టు అంత్యమందు ప్యాసయే ఆస్తిగా ఎంచకూడదు.

1 వ వివరణము : జీవితకాలము తనకున్ను, అనంతరం ఇంకొకరికిన్ని, ఆఖరున మరల సమస్త అధికారములతోను తనకే చెందునట్లున్ను ఒకరు ఆస్తి సెటిల్ చేసినప్పుడున్ను ఆ ఇతరులు ముందుగా చనిపోయి అప్పటికి సెట్లరు జీవితకాలపు హక్కుదారుగా స్వాధీనము కలిగి, ఇంకొకరి మరణమువల్ల తానే సంపూర్ణ హక్కుదారైన కారణముచేత మాత్రము ఆస్తి సెట్లరుకు మరణించినవారినుండి ప్యాసైనట్లెంచరాదు.

2 వ వివరణము : ఒకనికి సెటిల్ చేయబడిన అస్తిలోని ఇంటరెస్టు ఒక టెస్టేటరు లేక ఇంటెస్టేటుయొక్క ఆస్తిలో రెసిడ్యూ, లేక రెసిడ్యూలో భాగము అయియుండి, ఆ టెస్టేటరు బ్రతికియున్నంతవరకు ఆ ఎస్టేటు ఎడ్మినిస్టరు చేయబడుచున్న

యెడల, అట్టి వానికిగల ఇంటరెస్టు ఆరెసిడ్యూవల్లు వచ్చే ఆదాయము, సెట్లరు చనిపోయినవెంటనే నిర్ధారణ చేయబడిన యెడల, ఆ ఇంటరెస్టునుండి వచ్చిన ఆదాయము అని చెప్ప గలిగినప్పటినుండియూ, స్వాధీనముతో కూడిన ఇంటరెస్టుగా భావించబడును.

**24.** అన్యాక్రాంతము చేసినవారికే తిరిగి ఆస్తి చేరుట :

(1) ఒక అన్యాక్రాంతమువల్ల ఇంకొకరికి జీవితకాలం అనుభవపు హక్కున్ను, అనంతరం తిరిగి ఆ ఆస్తి అన్యాక్రాంతము చేసిన వానికే సమస్త హక్కులతోను చెందునట్లుగా అన్యాక్రాంతము చేయగా జీవితకాలపు హక్కుదారు అట్టి ఆస్తి స్వాధీనము పొంది అనుభవించుచు చనిపోయినయెడల, అన్యాక్రాంతము చేసినవానికి అట్టి ఆస్తి తిరిగి చేరినంతమాత్రముచేత ఆస్తి ప్యాసైన ట్లెంచబడదు.

(2) పై 1 వ సబ్ సెక్షనులో చెప్పినటువంటి అన్యాక్రాంతమువల్ల ఒకనికే కాకుండా, మరికొందరికి జాయింటుగా నైనను, వేరుగా నైనను, లేక ఒకరి తరువాత ఇంకొకరికైనను సంక్రమింప చేసినప్పుడు 1 వ సబ్ సెక్షను వర్తించదు.

కాని, అట్టి జీవితకాలపు హక్కుదార్లు అన్యాక్రాంతమునకు పూర్వము ఎప్పుడైనను ఆ ఆస్తిని అన్యాక్రాంతము చేయుటకు అర్హత కలిగియున్నయెడల 1 వ సబ్ సెక్షను వర్తించదు.

**25.** భార్యభర్తలలో ఒకరు చనిపోగా సంపాదించబడిన సెటిల్డు ఆస్తి ఆదాయము.

ఈ ఆక్టు అమలులోనికి రాకపూర్వము చేయబడిన అన్యాక్రాంతమువల్ల, భార్యకుగాని, భర్తకుగాని లేక ఉభయులకు జాయింటుగాగాని, ఆస్తి యొక్క రాబడియందు, హక్కు సెటిల్ చేయబడి,వారిలో ఒకరు చనిపోయినయెడల, రెండవ వారికి

అట్టి ఆదాయమునందు (ఆస్తియందు గాక) చనిపోయినవారి సెటిల్మెంటు వల్ల హక్కు కలిగినప్పుడు రెండవ మిగిలినవారు కూడ చనిపోయేవరకు ఎస్టేటుడ్యూటీ చెల్లించనక్కరలేదు.

**26.** రొఖ్ఖ ప్రతిఫలమునకు బోనాఫైడిక్రియములవల్ల ప్యాసయే ఆస్తి :

(1) మరణానంతరము ప్యాసయే ఆస్తిలో చనిపోయినట్టిన్నీ అన్యాక్రాంతము చేసినట్టిన్నీ వారి స్వంత ఉపయోగము నిమిత్తము రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలం ఇచ్చి సదుద్దేశముతో నిజముగా (బోనాఫైడిగా) పొందిన క్రియాస్తికిన్నీ, జీవితకాల కవులు అనంతరం చెందే వారసత్వపుహక్కు కవులు యిచ్చినవానికి రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలమునకు స్వాధీనముతో గూడిన హక్కుగా మారిన ఆస్తికిన్నీ జీవితకాలము యివ్వవలసిన ఏన్యుయిటీ అంత్యమగుచు అందులకు రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలం ఎవరికి ట్రస్టీగా ఏన్యుయిటి యివ్వబడెనో వారి లాభం నిమిత్తము ఇవ్వబడిన ఆస్తికిన్నీ 27,46 సెక్షనులకు లోబడి, ఎస్టేటు డ్యూటీ చెల్లించనక్కరలేదు.

(2) పైన చెప్పినటువంటి క్రియము, కవులు, లేక ఏన్యుయిటీలకు కొంతవరకు మాత్రమే రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలం యివ్వబడినప్పుడు ప్యాసయే ఆస్తిలో రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలముయొక్క కిమ్మతు మినహాయించి మిగతా ఆస్తి కిమ్మతు పైననే ఎస్టేటుడ్యూటీ విధించబడును.

**27.** బంధువుల పేర అన్యాక్రాంతములు :

(1) తన బంధువులలో నొకని పేర, మరణించినవారు చేసిన అన్యాక్రాంతము.

(ఎ) తన స్వంత ఉపయోగము లేక లాభము నిమిత్తము రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలమునకు మరణించినవారు చేసిన అన్యా

క్రాంతము అయితే తప్పయున్న,

(బి) తానే చేసిన అన్యాక్రాంతమువల్ల గాక ఇతర అన్యాక్రాంతముల వల్ల మరణించినవారు ఇంకొకరి తరపున మేనేజి చేయుచుంటే తప్పయును,

9 వ సబ్ సెక్షనుక్రింద దానముగా ఎంచబడును. ఈఆస్తి నిమిత్తము దానము ఇట్టిదికూడా అగును.

కాని, కొంతవరకే రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలంకు మాత్రమే మరణించినవారట్టి అన్యాక్రాంతము చేసినయెడల ఎస్టేటుడ్యూటీ నిమిత్తము ఆస్తి కిమ్మతులో నుండి అట్టి ప్రతిఫలం కిమ్మతు మినహాయించబడును.

(2) మరణించినవాడు తన బంధువులలో నొకని పేర అన్యాక్రాంతము చేసినప్పుడు మరణించినవానికి, వాని మరణానంతరము వరకు గాని ఇంకొకరి మరణానంతరము వరకుగాని ఇచ్చుటకు ఒక ఏన్యుయిటీ లేక ఇతర ఇంటరెస్టు కలుగజేయుట అన్యాక్రాంతమునకు ప్రతిఫలముగా ఎంచబడదు.

(3) కంట్రోల్డు కంపెనీ సంబంధము కలిగియున్న వ్యాపారమునకు యీ క్లాజు (ఎ), లేక యీ 1 వ సబ్ సెక్షనులోని ప్రొవైజో వర్తించునని క్లెయిం చేయునపుడు, కంపెనీ మెంబర్లకున్ను, కంపెనీ వ్యాపారముతో ఏమీ నిమిత్తములేని కంపెనీ బాకీపడిన మరొకరికిన్ని, కంపెనీ షేర్ల లేక డిబెంచర్ల వరతులప్రకారము ఉండే రైటు ననుసరించి ట్రస్టీగా కంపెనీ ఎసెట్లను కలిగియుండి ఆ ఎసెట్లను ట్రస్టు నిమిత్తము వినియోగించవలసియున్న ట్రస్టీగా ఎసెట్లను కంపెనీ కలిగియున్నపుడు, కంట్రోలరుకు పైన చెప్పిన ప్రొవిజనులు ఎంతవరకు వర్తించునని తృప్తికలుగునో అంతవరకు మాత్రమే వర్తించును.

(4) కంట్రోల్డు కంపెనీలో చనిపోయినవారు చనిపోవునరికి 17 వ సెక్షనులో చెప్పినట్లు కంట్రోలు ఉండి, వాని బంధువు పేర

కంపెనీ చేసినదానము 9 వ సెక్షనుక్రింద దానముగా ఎంచి దానపు ఆస్తి చనిపోయినవానియొక్క ప్యాసయే ఆస్తిలో పై క్రిందటి సెక్షను ననుసరించి కంట్రోలరుకు తృప్తికలుగునంత మట్టుకు చేరియున్నట్లెంచబడును.

(5) ఒక బంధువు పేర 2 వ సబ్ సెక్షనుక్రిందవచ్చే అన్యాక్రాంతము ను చనిపోయినవారు ఒక కంపెనీపేర చేసినయెడల తన బంధు వెవ్వరున్ను కంపెనీలో అన్యాక్రాంతమునాటికి గాని దరిమి లానుగాని మరణించిన వాని జీవితములో దాని మెంబరుకాడని కంట్రోలరును తృప్తిపరచితే తప్ప, లేనియెడల అట్టి బంధువు పేర చేసిన అన్యాక్రాంతమునకు వలెనే ఈసెక్షను వర్తించును.

వివరణము : ఈ సబ్ సెక్షను నిమిత్తము ఇంకొక కంపెనీలో మెంబరైన ఒక కంట్రోల్డు కంపెనీలో మెంబరై యున్నట్టి గాని ఈ సెక్షను ప్రకారము మెంబరైయున్న ట్లెంచబడునట్టి గాని వ్యక్తి ఆ యింకొక కంపెనీలో కూడా మెంబరైయున్న ట్లెంచబడును.

(6) 2 వ సబ్ సెక్షనులో చెప్పబడిన ఏన్యుయిటీ లేక ఇతర ఇంట రెస్టు ఇచ్చుటలో చనిపోయినవాడు పుచ్చుకునేటట్లు ఎస్సోసి యేటెడ్ ఆపరేషనులు జరిగినయెడల, లేక చనిపోయినవాడు అట్టి ఏన్యుయిటీ లేక ఇంతర ఇంటరెస్టు పుచ్చుకోగలయట్లున్ను లేక పుచ్చుకొనుటకు సులువు కలుగచేయునట్లున్ను ఎస్సోసి యేటెడ్ ఆపరేషనులు జరిగినయెడల చనిపోయినవాని పేర చేయబడిన ఏన్యుయిటీ లేక యింటరెస్టుకు ఈ సెక్షను వర్తించు నట్లే అట్టి ప్రతీ ఎస్సోసియేటెడ్ ఆపరేషనుకు ఈ సెక్షను వర్తించును.

(7) యీ సెక్షనులో,

(i) "బంధువు" అనగా (ఎ) చనిపోయినవాని భార్య లేక భర్త.

(బి) చనిపోయినవాని తండ్రి, తల్లి, సంతతి, పినతండ్రులు, పిన తల్లులు.

(సి) పైన చెప్పినవారి సంతతిన్నీ అయి వుందును.

(ii) "పిల్లలు", "సంతతి" అన్నచోట్ల వివాహము కానివారితో కలిగిన సంతతిన్ని, దత్తత సంతతిన్నీ కూడ అగునురు.

(iii) "ఏన్యుయిటీ" అనే పదములో ఒకదానితో ఒకటి సంబంధించినను లేకపోయినను సమానమైన లేక అసమానమైన కాలములందు లేక యితరత్రా ఇచ్చు వసూళ్ళ వరుసలు కూడియుండును. కంపెనీషేర్లు లేక డిబెంచరులకు పంచి యివ్వఁబడే డివిడెండ్లు లేక వడ్డీసొమ్ము వసూళ్ళ వరుసలు మరణానంతరం షేర్లు, డిబెంచర్ల హక్కులు మారుట కారణంచేత నిలుపుచేయబడు లేక తగ్గించబడు వసూళ్ళు అయినయెడల, ఈ సెక్షను నిమిత్తము మరణానంతరము అంత్యమయే ఏన్యుయిటీగా ఎంచబడును.

(iv) "ఎసోసియేటెడ్ ఆపరేషనులు" అనగా ఏ రెండు, అంతకన్న ఎక్కువ, ఆపరేషనులు అయినను అగును. అవి ఏవనగా,

(ఎ) ఒకే ఆస్తిని గురించిగాని, లేక కొన్ని ఒక ఆస్తిని గురించిన్నీ మరికొన్ని ఆ ఆస్తికి ప్రతిబద్ధా ఆస్తినిన్నీ లేక ఆ ఆస్తివల్ల వచ్చే ఆదాయము లేక కూడబెట్టిన ఆదాయమును రిప్రెజెంటు చేయు ఆస్తిని గురించిన్నీ చేయబడు ఆపరేషనులు, లేక,

(బి) ఒకదానిని గురించి ఇంకొకటిగాని ఒకదానిని చేయగలుగునట్లు లేక చేయుటలో సులువగునట్లు 2 వది గాని, ఏ రెండు ఆపరేషనులైనను, 3 వ ఆపరేషను, మొదటి రెంటిలో ఏ ఒకదానికైనను పై విధముగా సంబంధించునట్టిన్నీ; 4 వ ఆపరేషను మొదటి మూడింటిలోను ఏ ఒకదానికైనను పై విధముగా సంబంధించునదిన్నీ, ఇదే ప్రకారం ఇంకను ఎక్కువ ఆపరే

పనులైనను అట్టి ఆపరేషనులు ఒకే వ్యక్తివల్ల చేయ బడినను, లేక అనేక వ్యక్తులచేత చేయబడినవైనను పైన చెప్పినవిధముగా ఒకదానితో సంబంధించియైన ను, సంబంధించక అయినను అవి యన్నియు ఒకే సమయమున చేయబడినను లేక వేరువేరు సమయ ముల చేయబడినను,

వెనుకటి క్రియములు, తణఖాలుమీద కొత్త లేక ఎక్కువ చేయబడిన డ్యూటీ రేట్ల ఇఫెక్టు :

ఈ ఆక్టు అమలులోనికి వచ్చుటకు ముందుగాని, దరిమిలాను గాని, ఒక ఆస్తియందు గల వచ్చునని తలచు ఇంతరెస్టును రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలమునకు సదుద్దేశముతో నిజముగా క్రియపరచినను తణఖా పెట్టినను, ఆ క్రియము గాని తణఖాగాని జరిగిన కాలమునకు ఉండియున్న ఎస్టేటు డ్యూటీ రేట్లకన్న, అట్టి వచ్చునని తలచు ఇంటరెస్టు స్వాధీనానుభవములతో కూడిన ఇంటరెస్టుగా మారినప్పుడు ఉండే రేట్లు హెచ్చుగా నున్నయెడల,

(ఎ) క్రియము లేక తణఖా కాలమందు అమలులోనున్న రేట్ల ప్రకారము ఇవ్వవలసిన ఎస్టేటుడ్యూటీ గాక మరి ఏ ఇతర డ్యూటీన్ని వచ్చునని తలచు ఇంటరెస్టు స్వాధీనపు హక్కు గా మారినప్పుడు ఆ క్రియదారు గాని తణఖాదారుగాని చెల్లించనక్కర లేదు. మరియు,

(బి) తణఖా విషయములో తణఖా పెట్టినవాడు చెల్లించవలసిన హెచ్చుడ్యూటీ తణఖా పట్టినవాని హామీాకి దరిమిలా ఛార్జితో సమమగును.

చనిపోయిన భార్యగాని భర్తగాని చనిపోగా ఎస్టేటుడ్యూటీ చెల్లించబడిన సెటిల్డు ఆస్తి :

సెటిల్మెంటు దరిమిలాను సెటిల్ చేయబడిన ఆస్తికి దంపతులలో నొకరి మరణానంతరమున ఎస్టేటుడ్యూటీ చెల్లించినయెడల, రెండవ

వారు మరణించినప్పుడు సెటిల్మెంటు అమలులో నుండగా ఎప్పుడైనను అట్టి ఆస్తిని అన్యాక్రాంతము చేయుట కర్తృత కలిగియుండిన తప్పయున్న, మరియు, వాని మరణానంతరము సెటిల్మెంటులోని మిగతా షరతులు అమలులోనికి వచ్చు నెడలయున్న మరణ కాలమునకు గాని, ఆస్తి అన్యాక్రాంతము చేయుట కర్తృత కలిగియున్న కాలమందుగాని దావాచేయుట కర్తృత కలిగియుండునెడలనున్న తప్ప, మరల ఎస్టేటుడ్యూటీ చెల్లించనక్కరలేదు.

**30.** రెండు మారులు ఎస్టేటుడ్యూటీ విధించకుండుటకున్న విధించినయెడల సహాయము చేయుటకున్న అగ్రిమెంటు.

కేంద్రప్రభుత్వము అనుకూలమైన ఇతర దేశముల ప్రభుత్వములతో ఈ ఆక్టు క్రిందనున్న ఇతర దేశములలోని ఇటువంటి లా ప్రకారమున్న రెండు మారులు పన్ను విధింపుకాకుండగనున్న లేక అట్లు విధించిన పన్ను తొలగించుటకున్న ఒడంబడిక చేసుకొని, దానిని నెరవేర్చుటకు అఫిషల్ గెజిట్టులో ప్రచురించి ఏర్పాటు చేయవచ్చును.

వివరణము : అనుకూలమైన దేశములు అనగా ఈ ఆక్టు నిమిత్తము కేంద్రప్రభుత్వము డిక్లేరుచేసి అఫిషల్ గెజిట్టులో ప్రచురించునవి అని అర్థము.

**31.** వెంటవెంటనే జరుగు సంక్రమింపులకు సహాయములు :

ఒకరి మరణానంతరము ఆస్తి ప్యాసగుటచే,ఎస్టేటుడ్యూటీ చెల్లించిన 5 సంవత్సరములలోపుననే ఎవరికి ఆస్తి ప్యాసయినదో వారి మరణమువల్ల మరల ఆ ఆస్తిగాని, అందు కొంతగాని ప్యాసైనట్లు బోర్డు తృప్తిచెందినయెడల, 2 వ మరణానంతరము చెల్లించవలసిన డ్యూటీ ఈ క్రింది విధముగా తగ్గించబడును.

మొదటి మరణకాలమునుండి 2 వ మరణము 1 సంవత్సరము లోపున అయితే 100 కి 50 వంతున,

డిటో 2 సం॥లు లోపున అయితే 100 కి 40 వంతున,
డిటో 3 సం॥లు లోపున అయితే 100 కి 30 వంతున,
డిటో 4 సం॥లు లోపున అయితే 100 కి 20 వంతున,
డిటో 5 సం॥లు లోపున అయితే 100 కి 10 వంతున,

కాని, 2 వ మరణానంతరమున ఎస్టేటుడ్యూటీ విధించే ఆస్తి కిమ్మతు, మొదటి మరణానంతరమున ఎస్టేటుడ్యూటీ విధించే ఆస్తి కిమ్మతును మించినయెడల, ఈ సెక్షనుక్రింద డ్యూటీ తగ్గుదల నిమిత్తము మొదటి కిమ్మతుకు బదులుగా 2 వ కిమ్మతునే తీసుకొందురు.

1 వ వివరణము : ఈ సెక్షను నిమిత్తము ప్రతీ మరణము దాని క్రిందటి మరణమునకు 2 వ మరణముగా ఎంచబడును.

2 వ వివరణము : ఒక మరణమునుండి 3 మాసములలోపున ఇంకా కొన్ని మరణములు సంభవించినప్పుడు, ఈ సెక్షను క్రింది కాలములు లెఖ్ఖచూచుటలో, ఆ మరణములు అన్నీ ఒకే మరణము క్రింద లెఖ్ఖించబడును. ఆ 3 మాసములలోపున ఆ ఆస్తిపైన మిగతా మరణమువల్ల మరల ఎస్టేటుడ్యూటీ చెల్లించ నక్కరలేదు.

**32.** కొన్ని కేసులలో హిందూ వితంతువుకు ఉండే ఇంటరెస్టు వారసులకు పోయినప్పుడు డ్యూటీ ఉండదు:—హిందులాప్రకారము భర్త చనిపోయినాక భార్యకు సంక్రమించిన ఇంటరెస్టు, భర్త చనిపోయిన 7 సంవత్సరములు లోపున వితంతుచనిపోగా వారసులకుగాని, వారసులలో కొందరికిగానిసంక్రమించినప్పుడు, భర్త చనిపోయినప్పుడు ఎస్టేటుడ్యూటీ చెల్లించియున్నయెడల మరల ఏ విధమైన ఎస్టేటు డ్యూటీయున్ను విధించరాదు.

**33.** డ్యూటీలేనివి.

(1) ఒకని మరణానంతరమున ఈ సబ్ సెక్షను అన్ని క్లాజులలోను చెప్పియున్నంతమట్టుకు ఈ దిగువ తరగతుల మరణించినవాని

ఆస్తులపై ఎస్టేటుడ్యూటీ చెల్లించనక్కరలేదు.

(ఎ) మరణమునకు వెనుక 6 మాసములలోపున మరణించిన వాడు ప్రజలకు ధర్మము నిమిత్తము దానము ఇవ్వగా పుచ్చుకొన్న ఆస్తిపై రు 2500- లు వరకు.

(బి) మరణమునకు వెనుక 2 సం॥లు లోపున ఎందునిమిత్తమై నను సరే చేయబడిన దానముగా తీసుకోబడిన ఆస్తికి రు 1500- లు కిమ్మతు వరకు.

(సి) మరణించినవాని జీవనోపాధి నిమిత్తము ఉపయోగపడు పనిముట్లు, వ్యవసాయపు పనిముట్లతో సహా, గృహోప కరణములు. రు 2500- లు కిమ్మతు వరకు.

(డి) అమ్మ ఉద్దేశించి యుండని పుస్తకములు.

(ఇ) దుస్తులు, విలువగల వజ్రములు, రాళ్ళు, నగలు కూర్చ బడిన దుస్తులు మాత్రము కావు.

(ఎఫ్) ఎస్టేటుడ్యూటీ చెల్లించే నిమిత్తము గాని, అందు నిమిత్త ము ప్రభుత్వముపేర ఎసైన్ చేసినట్టిగాని మరణించిన వాని జీవితముపై భీమా చేయించియున్న పోలసీల ద్వారా వచ్చే సొమ్ములలో రు 50,000 లకు మించకుం డా డ్యూటీమట్టుకు.

(జి) ఎస్టేటుడ్యూటీ చెల్లించే నిమిత్తము ప్రభుత్వమువారు నిర్ణయించే విధముగా ప్రభుత్వమువారి వద్ద డిపోజిట్టు చేసిన సొమ్ములున్ను, నిర్ణయించబడే రేటున ఈడిపోజిట్టు పై వడ్డీయున్ను, రు 50,000- లు మించకుండా డ్యూటీ చెల్లించుటకు సరిపోవునంతవరకు,

(హెచ్) మరణించినవాడు తన జీవితముపై ఇన్స్యూరుచేసిన పోలసీలక్రిందవచ్చేసొమ్ము రు. 5000 లు వరకు

(ఐ) డ్రాయింగులు, పెయింటింగులు, అచ్చులు, చేవ్రాతలు, ఆర్టుపనులు, ఆర్కియోలాజికల్ అండ్ సైంటిఫిక్ కలెక్ష నులు జాతీయ, సైంటిఫిక్, చారిత్రకమైనవిన్ని—చనిపో

యిన వాసికుటుంబములో ఉంచుకొనబడినవిన్నీ బోర్డు నిర్ణయించు కండిషనుల ప్రకారము వ్యవహరించబడినవిన్నీ లేక గవర్నమెంటువారికి, విశ్వవిద్యాలయములకు లేక ఇతర ప్రజాసంస్థలకు సమస్త హక్కులతోను ఇచ్చివేయ బడినవిన్నీ

(జె) క్లాజు (ఐ) క్రిందరానివిన్నీ చనిపోయినవాని కుటుంబములో ఉంచుకోబడినవిన్నీ బోర్డువారు నిర్ణయించే కండిషనుల ప్రకారం వ్యవహరించబడునవిన్నీ అమ్మ ఉద్దేశము లేనివిన్నీ అయిన డ్రాయింగులు, పెయింటింగులు, ఛాయాపటములు, అచ్చులు, చేవ్రాతలు, వార్సులకు సంక్రమించే గృహసంబంధమైన ఇతరచరాస్తిన్ని.

(కె) మరణించినవాని కుటుంబములో వానిపై ఆధారపడియున్న స్త్రీ సంతతి బంధువులయొక్క వివాహముల నిమిత్తం కేటాయింపుచేసిన భీమాపోలసీల బాపతుగాని, ట్రస్టు, సెటిల్మెంటులద్వారా డిక్లేరు చేయబడినట్టిగాని సొమ్ములు ఒక్కొక్క వివాహమునకు రు 5000 లు మించకుండా.

(2) ఏతరగతి ఆస్తి విషయములోనైనను, ఏతరగతి వ్యక్తులు విషయములోనైనను 1 వ సబ్ సెక్షను ప్రకారము పూర్తి సదుపాయము చేయదగియున్నట్లు కేంద్రప్రభుత్వము వారు తగ్గించినయెడల, అట్టిప్రభుత్వము వారు అఫిషల్ గెజిట్టులో ప్రచురించుట మూలముగా డ్యూటీనుండి తప్పించుటగాని, రేటు తగ్గించుటగాని చేయవచ్చును. అట్టిసందర్భములో అట్లుచేయబడిన ప్రచురణ పార్లమెంటు రెండుసభలయందు వీలైనంత త్వరలో ఉంచవలెను.

4 వ భాగము - ఆస్తులు మొత్తముచేయుట డ్యూటీ రేట్లు.

**34.** మొత్తము చేయుట :

మరణములవల్ల ప్యాసయే ఆస్తులపై చెల్లించవలసిన డ్యూటీ నిర్ణయించుటకు,

33 వ సెక్షను 1 వ సబ్ సెక్షను సి,డి,ఇ,ఐ,జె క్లాజులలో చెప్పిన డ్యూటీలేని ఆస్తులు వదలివేసి,

(i) 33 వ సెక్షను ప్రకారము ఎస్టేటు డ్యూటీ విధింపరాని ఆస్తినీ

(ii) 13 వ సెక్షను ఎ,బి,ఎఫ్,జి, హెచ్,కె క్లాజులలో మినహాయింపదగిన ఆస్తినీ

(iii) 1 వ షెడ్యూలులో చెప్పియుండని రాష్ట్రములలోని వ్యవసాయపుభూములకున్ను

కలిపి, ఒక ఎస్టేటుగాచేసి, వాటి అసలు కిమ్మతుమీద కట్టవలసిన రేట్లప్రకారము డ్యూటీ విధించవలెను.

అయితే, 2 వ సెక్షను 15 వ క్లాజులోని వివరణముల ప్రకారము ఆస్తిగా ఎంచబడే బాకీ, రైటు లేక లాభము గాక, మిగతా మరణించినవానికి ఎన్నడూ హక్కు లేనట్టిన్నీ, ప్యాస యేటట్టిన్నీ ఆస్తి ఏ యితర ఆస్తితోను కలపకుండా", అది ప్రత్యేకము ఒక ఎస్టేటుగానే వుంచి, అందలి అసలు కిమ్మతుపై కట్టవలసిన రేట్లప్రకారము డ్యూటీ కట్టవలెను.

(2) ప్రతీ ఎస్టేటులోను మరణము తేదీవరకు రావలసియున్న రాబడి యావత్తు చేరియుండవలెను.

(3) మరణానంతరమున ప్యాసయే ఏ ఆస్తినీ ఒక మారుకన్న మొత్తములో చేర్చకూడదు. ఒకే మరణానంతరమున అట్టి ఏ ఆస్తిపైన ఒకమారుకన్న డ్యూటీ విధించరాదు.

(4) ఒక ఎస్టేటుడ్యూటీనుండి మినహాయించదగిన ఆస్తి చేరియున్న యెడల మినహాయించదగని ఆస్తిపై విధించవలసిన డ్యూటీనీ, మినహాయింపు అసలు లేదనుకొనుపద్ధతిని మొత్తం ఎస్టేటు కిమ్మతుకున్ను ఉండే ప్రపోర్షను అయి యుండును.

వివరణము : ఈ సబ్ సెక్షను నిమిత్తము ఎస్టేటుడ్యూటీనుండి మినహాయించదగిన ఆస్తి అనగా, 33 వ సెక్షను ప్రకారము ఎస్టేటుడ్యూటీనుండి మినహాయించదగిన ఆస్తిన్నీ 1వ షెడ్యూలులో లేని రాష్ట్రములలోని వ్యవసాయపు భూములున్ను అని అర్థము.

**35.** వ్యవసాయపు భూములు కూడియున్న ఆస్తిపై ఎస్టేటుడ్యూటీ రేట్లు :

(1) ఎస్టేటు డ్యూటీ రేట్లు 2 వ షెడ్యూలులో చెప్పబడినవై యుండును. కాని ఈ క్రింది ఆస్తులమీద ఎస్టేటుడ్యూటీ విధించబడదు.

(ఎ) మితాక్షర, మారుమక్కత్తాయం, ఆల్యశాంతన లా వర్తించే హిందూకుటుంబమైన జాయింటు కుటుంబాస్తియందలి ఇంటరెస్టు అయిన ఆస్తి కిమ్మతులో రు 50,000- లు వరకు.

(బి) ఏ విధమైన ఇతర ఆస్తి అయినను, ఎస్టేటు అసలు కిమ్మతు రు 1,00,000- (లక్ష) మించకుండాను.

(2) ఒకని మరణానంతరము ప్యాసయ్యే ఎస్టేటు 1 వ సబ్ సెక్షను ప్రొవైజో. (ఎ) లో చెప్పిన ఆస్తి కొంతయున్ను ప్రొవైజో (బి) లో చెప్పిన ఆస్తి కొంతయున్ను ఉండియున్న యెడల అందుపై చెల్లించవలసిన ఎస్టేటుడ్యూటీ.

(i) ప్రొవైజో (ఎ) క్రింద వచ్చే ఆస్తి కిమ్మతుకున్ను ఎస్టేటు కిమ్మతుకున్ను ఏ రేషియో ఉండునో, మొత్తము ఎస్టేటు ఆస్తి అంతయు ప్రొవైజో (ఎ) లో చెప్పినట్టి ఆస్తి అయినప్పుడు ఉండే డ్యూటీలో అదే రేషియోగల మొత్తమునకు,

(ii) ప్రొవైజో (బి) క్రిందవచ్చే ఆస్తి కిమ్మతుకున్ను ఎస్టేటు యావత్తు కిమ్మతుకున్ను ఏ రేషియో ఉండునో మొత్తం ఎస్టేటు ఆస్తి యావత్తు ప్రొవైజో (బి) క్రింద చెప్పినట్టి ఆస్తి

అయినప్పుడు ఉండే డ్యూటీలో అదే రేష్యో మొత్తము కలిపినయెడల మొత్తము డ్యూటీ అగును.

(3) 1 వ సబ్ సెక్షనులోనున్ను 2 వ షెడ్యూలులోనున్ను ఎట్లు చెప్పబడియున్నను, ఒకని మరణానంతరము ప్యాసయే ఆస్తి అంతయు గాని, కొంతగాని వ్యవసాయపు భూమి అయిన యెడలనున్ను, ఎస్టేటు అసలు కిమ్మతు 2 లక్షల రూపాయలు మించకుండా ఉన్నయెడలనున్ను,

(ఎ) అంతయూ వ్యవసాయపు భూమి అయితే మొత్తము ఎస్టేటుడ్యూటీలో ¼ వ వంతు డ్యూటీ రిబేటుగా మినహాయించబడును.

(బి. కొంతమాత్రమే వ్యవసాయపు భూమి అయితే అందు పైన మాత్రమే చెల్లించవలసిన డ్యూటీలో అనగా, ఎస్టేటు మొత్తము కిమ్మతులో వ్యవసాయపు భూమి కిమ్మతు ఎంత ప్రపోర్షను అగునో అదే ప్రపోర్షను డ్యూటీలో ¼ వ వంతు డ్యూటీ రిబేటు యివ్వబడును.

5 వ భాగము ఛార్జి చేయవలసిన కిమ్మతు.

**36.** అసలు కిమ్మతు ఎట్లు ఎస్టిమేటు చేయునది :

(1) మరణకాలమందు బహిరంగబజారులో అమ్మినయెడల, కంట్రోలరు ఉద్దేశములో ఎంత కిమ్మతు వచ్చునో, అట్టి కిమ్మతే అసలు కిమ్మతుగా ఎస్టిమేటు చేయబడును.

(2) అసలు కిమ్మతు ఎస్టిమేటు చేయుటలో, మరణకాలమందు ఉండే బజారు కిమ్మతుప్రకారమే ఆస్తి కిమ్మతు కంట్రోలరు నిర్ణయించవలెను. ఒకే కాలమందు ఆస్తి అంతయు బజారులో అమ్మబడు కారణముచేత ఏ విధమైన తగ్గింపు చూపబడదు.

కాని, మరణమువల్ల ఆస్తి కిమ్మతు తగ్గినదని కంట్రోలరుకు

తృప్తిగా ఋజువుచేసినయెడల అట్టి తరుగును విచారించియే కిమ్మతు నిశ్చయించవలెను.

**37.** అన్యాక్రాంతము నిర్బంధించినప్పుడు ప్రయివేటు కంపెనీలోని షేర్లకిమ్మతు.

ప్రయివేటు కంపెనీయొక్క ఆర్టికిల్సు ఆఫ్ ఎసోసియేషను షేర్ల అన్యాక్రాంతమును గురించి నిర్బంధన షరతులు కలిగియున్నయెడల, కంపెనీకి ఉన్న మొత్తము ఎసెట్ల విలువనుబట్టి షేర్ల విలువ నిర్ణయించలేనియెడల అట్టి షేర్లు కొనువారిని ఆర్టికిల్సుకు లోబడి నమోజుచేయు షరతుతో మార్కెట్టులో అమ్మగలిగినయెడల వచ్చే కిమ్మతునే ఆ షేర్ల విలువగా నిర్ణయించవలెను. ప్రత్యేక కారణములుండి ఒక ప్రత్యేక ఖరీద్దారు ఎక్కువ కిమ్మతు నిచ్చుననే విషయమును వదలివేయవలెను.

**38.** వచ్చునని ఆశగల ఇంటరెస్టు కిమ్మతు :

ఒక ఎస్టేటులో వచ్చునని ఆశగల ఇంటరెస్టు కూడియున్నప్పుడు ఆ యింటరెస్టుపై మిగతా ఆస్తితో బాటే డ్యూటీ చెల్లించవలసినవారు చెల్లించుటకున్ను, లేదా ఈ భాగము డ్యూటీ ఆ ఇంటరెస్టు స్వాధీనములోనికి వచ్చినప్పుడు చెల్లించుటకున్ను అప్షను కలదు. మిగతా ఆస్తిపై డ్యూటీతోపాటు చెల్లించనియెడల,

(ఏ) మిగతా ఎస్టేటుపై చెల్లించవలసిన డ్యూటీ రేటు నిర్ణయించు నిమిత్తము, ఇంటరెస్టుయొక్క కిమ్మతు మరణకాలమునకు ఉండే కిమ్మతే అగును.

(బి) వచ్చునని ఆశగల ఇంటరెస్టు స్వాధీనములోనికి వచ్చినప్పుడు అందుపై చెల్లించవలసిన డ్యూటీ రేటు అట్టి ఇంటరెస్టు స్వాధీన కాలముకు ఉండే కిమ్మతులను బట్టిన్నీ మిగతా ఎస్టేటుకు ముందుగా నిర్ణయించిన కిమ్మతును బట్టిన్నీ నిర్ణయించవలెను.

**39.** మరణముతో అంత్యమయ్యే కోపార్సినరీ ఇంటరెస్టు కిమ్మతు :

(1) మితాక్షరా హిందూలా వర్తించే జాయింటు కుటుంబములోని మెంబరు మరణించినప్పుడు అంతరించెడి కోపార్సినరీ ఇంటరెస్టు వల్ల కడిగెడి లాభముయొక్క కిమ్మతు, ఆ మరణమునకు వెంటనే ముందు ఆ జాయింటు కుటుంబము విభాగములో మరణించినవానికి ఇవ్వబడెడి వాటా ఆస్తియొక్క అసలు కిమ్మతు అగును.

(2) మూరు ముకతాయం వారసత్వపు రూలువర్తించే తార్వాడ్ లేక తవాజిలోని ఒక మెంబరు మరణించగా అంతరించే ఇంటరెస్టువల్ల కలిగే లాభముయొక్క కిమ్మతున్ను, అల్యాశాం తన వారసత్వపు రూలు వర్తించే కుటుంబ లేక కవరులోని మెంబరు మరణింపగా అంతరించే ఇంటరెస్టువల్ల కలిగే లాభముయొక్క కిమ్మతు అట్టి మరణమునకు వెంటనే ముందు తార్వాడ్ తవాజీ లేక కుటుంబకవరు ఆస్తులను విభజనచేసినచో మరణించినవాని వాటాకు ఇవ్వబడే వాటా కిమ్మతు అగును.

(3) చనిపోయినవాని మరణమునకు ముందు పార్టిషన్ చేసినయెడల వాని వాటాకు వచ్చే ఆస్తి నిర్ధారణచేయు నిమిత్తము, మితక్షరా, మూరుముకతాయం అల్యాశాంతనలా ప్రకారం జాయింటు కుటుంబాస్తియొక్క కిమ్మతు తేల్చుటకు జాయింటు కుటుంబాస్తి యావత్తు చనిపోయినవానిదే అయి యున్న యెడల ఈ ఆక్టులోని ప్రావిజనులు ఎంతవరకు వర్తించునో అంత మట్టుకు సదరు ప్రావిజనులు వర్తింపచేయవలెను.

**40.** ఇంటరెస్టు అంత్యమగుటవల్ల కలిగే లాభముకు కిమ్మతు కట్టుట :

మరణానంతరము మరణించినవానికి గల ఇంటరెస్టు అంత్యమగునప్పుడు కలిగే లాభముయొక్క కిమ్మతు,

(ఎ) ఆస్తి యావత్తు రాబడికి ఇంటరెస్టు ఉంటే ఆస్తి యావత్తు యొక్క అసలు ఖరీదున్ను,

(బి) మొత్తం ఆస్తి రాబడి యావత్తుకు కన్న తక్కువ రాబడి యందు ఇంటరెస్టు ఉంటే ఇంటరెస్టు ఉన్నంతమట్టుకు సమానమైన రాబడి కలిపిన ఆస్తియొక్క కిమ్మతున్ను అయి వుండును.

**41.** మదింపు (కిమ్మతు) కంటోలరు కట్టవలెను :

ఈ ఆక్టులోని విషయములకు లోబడి నిర్ణయించబడే ప్రకారము ఏ ఆస్తియొక్క అయినను మదింపు (కిమ్మతు) కంట్రోలరుచే నిర్ధారణ చేయబడవలెను. కంటోలరు ఎవరినైనను ఏ ఆస్తినైనను పరీక్షించి రిపోర్టు చేయుటకు నియోగించినయెడల అట్టివారు నిర్ణయించబడే కాలములయందు ఆస్తియందు ప్రవేశించి పరీక్షించవచ్చును.

**42.** కిమ్మతు కట్టుటకైన ఖర్చులు :

ఏ ఆస్తియొక్క అయినను కిమ్మతులను గురించి ఎవరైనను రిపోర్టు చేయుటకు కంటోలరుకుఅవసరం కలిగినప్పుడు అందులకయ్యే న్యాయమైన ఖర్చులు కంటోలరు వహించును.

**43.** ఒక ఎస్టేటులోని భాగమైన ఏ ఆస్తికైనను: డ్యూటీకి జమాఖర్చు చెప్పవలసినవాని ధరఖాస్తుపై, అట్టికిమ్మతు కట్టుట సులువుగా చేయవచ్చునని కంటోలరుకు తోచినయెడల, అట్టి ఎస్టేటులోని భాగమైన తరగతి ఆస్తికి కంటోలరు అంగీకరించిన కిమ్మతును సర్టిఫై చేయవలెను.

6 వ భాగము మినహాలు.

**44** ఎస్టేటుయొక్క ఛార్జి చేయదగిన కిమ్మతు నిర్ధారణచేయుటలో న్యాయమైన దహనక్రియల ఖర్చులున్ను, కొన్నిమాత్రము గాక, ఋణములున్ను హామీలున్ను మినహాయింపు.

ఎస్టేటుడ్యూటీనిమిత్తము ఒక ఎస్టేటుకిమ్మతు నిర్ధారణచే యుటలో రు. 1000 లుక్కుమించకుండా దహనక్రియలఖర్చు లున్ను, ఋణములున్ను ఋణబాధ్యతలున్ను మినహాయించ బడును.

కాని, (ఎ) 27 వ సెక్షనుకులోబడి మరణించినవారి స్వంత ఉపయోగలాభముల నిమిత్తము నిజముగా రొఖులేకతత్తుల్య పూర్తి ప్రతిఫలమునకు చేయబడినవైతే తప్ప, తాను చేసిన అన్యాక్రాంతమువల్లనే ఏర్పరచిన ఋణములు బాధ్యతలకున్ను లేక,

(బి) మరి యే యితర ఎస్టేటు, లేక వ్యక్తివద్దనుండి వసూలుచ్చేయుటకు రైటు కలిగిన ఏ ఋణమునకున్ను (అట్టి వసూలు కాక పోయినయెడల తప్ప,)

(సి) ఒక ఎస్టేటులోని వివిధ భాగములుపై ఒకటికన్న ఎక్కువ పేమెంట్లు ఛార్జి చేయబడినప్పుడున్ను,

(డి) కట్నము రూపకముగ మరణించినవారు స్వయముగ గాని వాని తరపున ఇతరులు గాని చేసిన రు 5000-లుకు మించిన ఋణములకున్ను మినహాయింపు ఇవ్వబడదు. మినహాయింపు ఇవ్వబడిన ఋణములు లేక బాధ్యతలు అట్టి బాధ్యత గల ఆస్తుల కిమ్మతునుండి మినహాయించబడును.

వివరణము : ఈ సెక్షను నిమిత్తము, దహనక్రియల ఖర్చుల లో చనిపోయినది లగాయతు ఒక సంవత్సరమువరకు చేయ బడెడి శ్రార్ధ లేక బర్సికిక్రియలకు అవసరమైన ఖర్చులు కూడి యుండును.

**45.** **మినహాయింపు చేయదగిన ఋణముల పరిమితులు :**

మరణానంతరము ప్యానయే లేక ప్యాసైన క్లెంచబడే ఆస్తి లో, వచ్చునని తలచు ఇంటరెస్టును కొనుటకు సంపాదించుటకు

లేక అంతరింపచేయుటకు అంతయు గాని, కొంతగాని ఋణము లేక బాధ్యతల చేయబడినప్పుడున్ను, ఎవరియొక్క ఇంటరెస్టు అట్లు కొన,సంపాదింప, లేక అంతరింప,చేయబడినదో అట్టివారు అట్టి ఆస్తియందు చనిపోయినవాని వద్దనుంచి అన్యాక్రాంతము వల్లనైనను, లా ప్రకారము సంక్రమించుటచేతనైనను ఎట్టి ఇంటరెస్టునైనను పొందుటకు హక్కు కలిగినయెడల అప్పుడు ఎస్టేటు డ్యూటీ నిమిత్తము చనిపోయినవాని ఎస్టేటుయొక్క కిమ్మతు తేల్చుటలో అట్టి ఋణము లేక బాధ్యతవిషయమై మినహాయింపు యివ్వబడదు. అట్టి ఋణము, లేక బాధ్యత వహించి యున్న ఆస్తి ఋణము లేక బాధ్యతలేనట్లుగానే వ్యాల్యూ చేసిన క్లెయించబడును.

కాని,

(ఎ) అట్టి ఋణము లేక బాధ్యతలో కొంత మాత్రమే అట్టి ప్రతిఫలమునకు చేయబడినయెడల ఈ ప్రొవిజను అట్టి భాగమునకే వర్తించును.

(బి) ఎవరి వచ్చునని తలచు ఇంటరెస్టు కొనబడినదో వారు పైన చెప్పినప్రకారము కొంత ఆస్తికి మాత్రమే హక్కు కలిగిన యెడల, అట్టి హక్కుకలిగిన ఆస్తి భాగముయొక్క కిమ్మతుకున్ను మొత్తము ఆస్తి కిమ్మతుకున్ను ఉండే ప్రపోర్షను గల ఋణమునకు లేక బాధ్యతకు మాత్రమే ఈ ప్రొవిజను వర్తించును.

**46.** ఇంకనూ పరిమితులు :

(1) ఈ సెక్షను లేనియెడల 44 వ సెక్షనులోని క్లాజు (ఎ) లో చెప్పినట్లు చనిపోయినవారు చేసిన ఋణమునకున్ను లేక ఆ క్లాజులో చెప్పినట్లు చనిపోయినవాని అన్యాక్రాంతమువల్లనే

ఏర్పడిన బాధ్యతకున్ను, ఈ దిగువ చెప్పిన ప్రతి ఫలముల యొక్క కిమ్మతుకు ప్రపోర్షనేటుగా ఎబేటుమెంటుకు లోబడి మాత్రమే ఎట్టి మినహాయింపు అయినను ఉండును.

(ఎ) చనిపోయినవాని వద్దనుంచి వచ్చిన ఆస్తి.

(బి) చనిపోయినవాని ఏ ఆస్తికైనను ఎప్పుడైనను హక్కు కలిగి యున్నట్టిగాని తనకు ఆదాయము వచ్చు ఆధారము లలో చనిపోయినవాని ఆస్తి ఎప్పుడైనను చేరియున్నట్టి గాని మరియొకరి వద్దనుంచి వచ్చిన ఆస్తి.

కా ని

(1) ఇచ్చిన ప్రతి ఫలము పూర్తిగా గాని, కొంతగాని ఈ సబ్ సెక్షను క్లాజు (బి) లో చెప్పిన ప్రతిఫలము వంటిది అయి యున్నప్పుడు, ప్రతిఫలముగా లేక అందలి భాగములుగా ఇచ్చిన దానికిమ్మతు, ప్రతిఫలముగా ఇచ్చినదానిలో చేరి యున్నదిన్ని లేక 16 వ సెక్షను 1 వ సబ్ సెక్షను ప్రొవైజోలో ఏన్యుయిటీ లేక ఇంటరెస్టును కొనుటకు లేక సంపాదించుటకు ఇచ్చిన ప్రతిఫలమును గురించి ఋజువుచేయవలసిన విషయములు ఋజువుచేసిన ఆస్తిగాక, చనిపోయిన వానివద్ద నుంచి వచ్చిన ఆస్తి యావత్తుయొక్క కిమ్మతును మించినదని కంట్రోలరుకు తృప్తికలుగులాగున ఋజువుచేయ కలిగినయెడల, ఆ హెచ్చుభాగమునకు ఎబేట్మెంటు ఉండదు.

(2) ఋణము తీర్చియుండనియెడల 1 వ సబుసెక్షను వర్తించునట్టి ఋణము లేక బాధ్యత తీర్చుటకు చనిపోయినవాడు వినియోగించిన సొమ్ము లేక దానితో సమానమైనది అట్టి ఋణమునకు వెనుక 2 సంవత్సరములలోపునే తీర్చియుండనిచో అట్టి సొమ్ము చనిపోయినప్పుడు ప్యానరయే ఆస్తిగా ఎంచబడి, 25 వ సెక్షనుతో నిమిత్తము లేకుండా అందుపై ఎస్టేటుడ్యూటి చెల్లించవలెను.

(బి) ఈ సెక్షను నిమిత్తము 16 వ సెక్షను 2 వ సబ్ సెక్షను కూడ పనిచేయును.

**47.** ఈ అక్టు వర్తించెడి దేశీయప్రాంతములకు బైట నివసించుచుండువారికి చనిపోయినవాడు ఇవ్వవలసిన ఋణములు :

ఈ దేశములో వసూలు ఇచ్చుటకు కంట్రాక్టు చేయబడి ఉండునెడలనున్ను, లేక ఈ దేశములోనున్న ఆస్తులపై హామీ కలిగియుండునెడలనున్ను తప్ప, ప్రథమములో మినహాయింపు ఇవ్వబడదు. అట్టి అన్యదేశములలో చనిపోయినవానికి ఉండి, వాటి ఎస్టేటుడ్యూటీ చెల్లించబడిన ఆస్తినుండి ఋణము మినహాయింపు ఇవ్వబడును అట్లుప్రథమమున మినహాయింపు లేకుండా చెల్లించబడిన ఎస్టేటుడ్యూటీ మరల వాపసు ఇవ్వబడదు కాని అన్యదేశములో నున్న ఆస్తి అన్యదేశములలో నివసించు బాకీ ఇచ్చినవాని ఋణము తీర్చుటకు చాలదని కంట్రోలరుకు తృప్తికరముగా చూపించినయెడల అట్టి ఆస్తివల్ల తీరగా మిగిలిన ఋణభాగమునకు సరిపోవునంతమట్టుకు ఎస్టేటుడ్యూటీ వాపసు ఇవ్వబడును.

**48.** అన్యదేశములలో నున్న ఆస్తి రాబట్టుటకు లేక ఎడ్మినిస్టరు చేయుటకు అయిన ఖర్చులు కొంతమట్టుకు ఇవ్వబడును :

అన్యదేశములలోనున్న, చనిపోయినవాని ఆస్తి రాబట్టుటకు లేక ఎడ్మినిష్టరు చేయుటకు అదనపుఖర్చులు అయినవని కంట్రోలరు తృప్తిపడినయెడల, అట్టి ఆస్తి కిమ్మత్తునుండి అదనపు ఖర్చుల నిమిత్తము 5% కు మించకుండా, మినహాయింపు ఇవ్వవచ్చును.

**49.** అనుకూల ప్రదేశములలో చెల్లించబడిన డ్యూటీకి మినహా :

ఒకని మరణానంతరమున ప్యాసయే ఏ ఆస్తి అయినను ఒక అననుకూల దేశములోనుండి, అట్టి మరణమువల్ల అట్టి దేశము

లోని ఆస్తిపై ఎట్టి డ్యూటీ అయినను చెల్లించవలసియున్న దని కంట్రోలరు తృప్తిపడినయెడల, ఇందు విషయమై బోర్డు వారు చేసే నిబంధనలకు లోబడి అట్టి ఆస్తి కిమ్మతునుండి, అంతయు గాని కొంతగాని డ్యూటీ మినహాయింపు ఇవ్వ వచ్చును.

వివరణము : ఈ సెక్షను నిమిత్తము అననుకూల దేశము అనగా, భారత దేశముగాక ఏ యితర దేశమైనను, ఈ ఆక్టు నిమిత్తము అనుకూల దేశముగ డిక్లేరు చేయబడనిది అగును.

**50.** చనిపోయినవారి ఎస్టేటుకు రిప్రెజెంటేషను పొందుటకు కోర్టుఫీజు చెల్లించినప్పుడు ఎస్టేటు డ్యూటీలో సదుపాయము :

జమ్ము, కాశ్మీర రాష్ట్రము తప్ప ఏ యితర రాష్ట్రములోనైనను కోర్టుఫీజును గురించి అమలులో నున్న లా ననుసరించి, ఈ ఆక్టుక్రింద ఎస్టేటు డ్యూటీ విధింపవలసిన ఏ ఆస్తికైనను ప్రొబేటు ఎడ్మినిస్ట్రేషను ఉత్తరములు లేక వారసత్వపు సర్టిఫికెట్టు పొందు నిమిత్తము ఎట్టి కోర్టుఫీజు అయినా చెల్లించి నప్పుడు ఆ కోర్టు ఫీజుతో సమానమైన మొత్తము ఎస్టేటు డ్యూటీనుండి తగ్గించబడును.

7 వ భాగము : డ్యూటీవసూలు

**51.** ఎస్టేటు డ్యూటీ బోర్డువారు నిర్ణయించు విధానము ప్రకారము వసూలు చేయవచ్చును.

**52.** గవర్నమెంటు సెక్యూరిటీలను బోర్డువారికి సరియైనవని తోచిన కండిషనుల ప్రకారము అంగీకరించబడునని బోర్డు విధింపవచ్చును.

**53.** లెక్క చెప్పవలసినవారు వారి డ్యూటీలు, బాధ్యతలు :

(1) చనిపోయినవాని మరణానంతరమున ఏ ఆస్తియైనను స్వాస్థ సపడును,

(ఏ) స్వాధీనానుభవపు లాభకరమైన ఇంటరెస్టుతో ప్యాసైనట్టి, లేక ఎవరియందైనను, ఎప్పుడైనను ఎట్టి ఇంటరెస్టు అయినను వెస్టు అయినట్టిన్ని ప్రతీ లీగల్ రిప్రజెంటేటీవు,

(బి) ప్యాసయే ఆస్తియం దెట్టి ఇంటరెస్టయినను లేక మేనేజిమెంటైనను, ఎప్పుడైనను, వెస్టు అయియున్న ప్రతీట్రస్టీ, గార్డియన్, కమిటీ లేక యితర వ్యక్తి.

(సి) స్వాధీనముతో అట్టి ఆస్తియందలి ఇంటరెస్టు ఎప్పుడైనను అన్యాక్రాంతము ద్వారా వెస్టు అయియున్న ప్రతీవ్యక్తి వీరు మరణానంతరమున ప్యాసయే ఆస్తిపై యావత్తు ఎస్టేటుడ్యూటీకి లెఖ్ఖ చెప్పుటకు బాధ్యులై యుందురు.

కాని, వారిచే పొందబడిన లేక వారి అశ్రద్ధలేనియెడల పొందెడు ఆస్తిని మించిన ఎస్టేటుడ్యూటీకి బాధ్యులుకారు.

అయితే, ఆస్తి మేనేజిచేయుటలో ఏజంటుగా, లేక బెయిలిఫ్‌గా పని చేయువారిని ఈసెక్షనులోని దెద్దియు బాధ్యత గలవానిగా చేయదు.

(2) 1 వ సబ్ సెక్షనులో ఏమిచెప్పినను, కంట్రోలరుకు తృప్తికలుగు లాగున ఏ వారసు అయినను, మరియొక రెవరైనను చనిపోయినవారి ఏ ఎసెట్లనైనను వ్యతిరేక భుక్తము కలిగియున్నట్లు ఋజువు పరచినయెడల అట్టి ఎసెట్ల భాగముపై డ్యూటీకి ఆ వారసు బాధ్యుడు కాడు.

కాని, దరిమిలాను అట్టి వ్యతిరేక భుక్తములోనున్న ఆస్తి స్వాధీనపరచుకున్నయెడల ఆ వారసే బాధ్యుడగును.

(3) ఈ సెక్షనుక్రింద బాధ్యతగల ప్రతీవ్యక్తిన్ని మరణానంతరము 6 మాసములలోపున, లేక కంట్రోలరు యిచ్చే వాయిదాలోగా, కంట్రోలరుకు ఎస్టేటు డ్యూటి చెల్లించవలసిన యావదాస్తికి తనకు తెలిసినంతవరకున్ను నమ్మకము కలంతవరకున్ను ఎకౌంటు కంట్రోలరుకు వప్పగించి వెరిఫై చేయవలెను.

(4) ఏ ఆస్తియొక్క అయినను కిమ్మతు, లేక మొత్తము తెలియక తన అక్కవుంటులో చేర్చియుండనిచో అట్టి ఆస్తివున్నదనియు, మొత్తము లేక కిమ్మతు తెలియక చేర్చలేదనియు, వ్రాసి ఆవివరములు తెలిసినవెంటనే సప్లిమెంటరీ అక్కవుంటుయిచ్చెద ననియూ చెప్పవలెను.

(5) ఇద్దరుగాని ఎక్కవమందిగాని ఒకే తాహతులోగాని వేరువేరు తాహతులలోగాని అక్కవుంటు చెప్పుటకు బాధ్యులైనచో, అట్టి యావత్తుడ్యూటీకి వారు ప్రత్యేకముగా ఎవరికివారున్ను, అంతాకలిసిన్నీ జాయింటుగా కూడా బాధ్యులు.

**54.** అక్కవుంటు చెప్పవలసినవారిలో కొన్నికేసులలో ట్రస్టీలుకూడా ఉందురు.

(1) 2 వ సెక్షనుప్రకారము మరణానంతరము అంత్యమయ్యే ఇంటరెస్టు స్వాధీనముతోకూడిన తరువాత అంతాకాని కొంతకాని అంత్యమైనప్పుడు లేక స్వాధీనము తప్పినప్పుడు ఇంటరెస్టు ఉండిన ఆస్తి ఎట్టిస్వభావము కలదియైనను ఆ 2వ సెక్షనుప్రకారము చనిపోయినతరువాత చెల్లించవలసిన ( యీసెక్షనువల్లకాకుండా ఇతరత్రా చెల్లించవలసిన డ్యూటీగాక ఏ ఎస్టేటుడ్యూటీకైనను ఈక్రిందివారు బాధ్యులు:—

(ఎ) మరణకాలమందు ఏసెటిల్మెంటుక్రింద యింటరెస్టు అములులోనున్నదో ఆ సెటిల్మెంటు బ్రతికియున్న యెడల ఆ సెటిల్మెంటుక్రింద ఏర్పడిన ట్రస్టీలున్ను,

(బి) లేనియెడల ఆ సెటిల్మెంటుక్రింద గతంలో ఉండియున్న ట్రస్టీలున్ను.

(2) (ఎ) 11 వ సెక్షనుప్రకారము సెటిల్మెంటుచేసిన ట్రస్టీలు ఎస్టేటుడ్యూటీకి ఎక్కవుంటు చెప్పవలసినవారు అయినయెడల నున్ను మరియూ,

(బి) ఆస్తి అంతయూగాని కొంతగాని సెటిల్మెంటులో నుండుట మానివేయుటకు ఉద్దేశింపబడిన యెడలనున్నూ,
కంట్రోలరు అభిప్రాయములో ముందు ఇవ్వబడవలసిన డ్యూటీ అనిసరిగా ఎంచవచ్చుననెడి మొత్తమునకు కంట్రోలరువద్దనుండి ట్రస్టీలు ఒక సర్టిఫికెట్టు పుచ్చుకొన్నయెడల నున్నూ, మరియు అట్టి సర్టిఫికెట్టునిమిత్తము ధరఖాస్తుకు సంబంధించినట్టిన్ని కంట్రోలరుకు కావలసినయావత్తు సముజాయిషీయున్ను సాక్ష్యమున్ను ఇచ్చినయెడలనున్ను, సర్టిఫికెట్టులో సర్టిఫై చేయబడిన మొత్తమునుమించి సర్టిఫికెట్టుకు సంబంధించినడ్యూటీకి లెఖ్ఖచెప్పుటకు సెటిల్మెంటు దాఖలా ట్రస్టీలు ఎవరున్ను బాధ్యులుకారు.

(3) 11 వ సెక్షనుప్రకారము ఒక సెటిల్మెంటు ట్రస్టీగా సెటిల్మెంటు ఆస్తికి చెల్లించవలసిన ఎస్టేటుడ్యూటీకి లెఖ్ఖచెప్పుటకు బాధ్యుడైనవ్యక్తికి ముందు విధించబడెడి ఎస్టేటుడ్యూటీకిన్ని ఖర్చులకున్ను తనచేతిలోనున్నట్టిన్ని సెటిల్మెంటులో చేరియున్నట్టిన్ని, ఆస్తిపై లియన్ (హామీ) కలిగియుండునని ఇందుమూలముగా డిక్లేరు చేయబడినది.

**వివరణము :** ఈ సెక్షనులో ముందు విధించబడెడి డ్యూటీ అన్నది, డ్యూటీ విధించబడునని ఎంచిన ఎస్టేటు డ్యూటీ అనుకోవలెను.

**55.** స్వాధీనములోనున్నట్లు నమ్మెడి ప్రతివ్యక్తి కంట్రోలరు కోరెడి ఆస్తివివరముల స్టేటుమెంటు వప్పగించవలెను,

ఎస్టేటు డ్యూటీకి లెఖ్ఖచెప్పవలసిన ప్రతీవ్యక్తి, చనిపోయిన వాడు 17 వ సెక్షనుప్రకారము ఆస్తి ట్రాన్సఫరుచేసియున్న ప్రతీ కంపెనీయున్ను, అట్టికంపెనీలో ఇప్పుడుగాని ఎప్పుడైనను

గాని, ఆఫీసరు లేక అడిటరుగానున్నట్టిన్నీ, ప్రతిన్యాక్టీన్నీ, చని పోయినతరువాత చనిపోయినవాని ఎస్టేటునుగాని, అందలిభాగ మునుగాని, లేదా అందలి ఆదాయమునుగాని స్వాధీనముచేసి కొనియున్నట్లున్నూ లేక ఎడ్మినిస్టరు చేసియున్నట్లున్నూ కంట్రో లరుకు నమ్మకముగల ప్రతీన్యాక్టీన్నీ, కంట్రోలరు కావలెనంటే అట్టి వివరముల స్టేటుమెంటున్నూ, దానితోబాటు డ్యూటీవిధిం చదగిన ఆస్తి అని కంట్రోలరు నమ్మటకు హేతువుగల ఆస్తికి సంబంధించిన, తనకు తెలిసినంతవరకున్నూ నమ్మకముగలంతవర కున్నూ, అక్కవుంట్లు దస్తావేజులు, నముజాయిషీ, ఋజువున్నూ ఇచ్చి తీరవలెను.

**56.** లేనియెడల పినాల్టీ: ఏ వ్యక్తియైనను 53, 55 సెక్షనులలోని విషయ ములను సరియైన కారణములేకుండా తెలుపుటకు తప్పిపోయిన యెడలనున్నూ, లేదా అట్టివిషయములను ఇవ్వబడినగడువులోగా ఇచ్చుటకు తప్పినయెడలనున్నూ, రు 1000/-లుగాని, చెల్లించబడక నిలచియుంటే, తాను అక్కవుంటు చెప్పవలసినట్టిన్నీ నిలచి యున్నట్టిన్నీ ఎస్టేటుడ్యూటీకి రెట్టింపుమొత్తముగాని, కంట్రో లరు విధించెడి పినాల్టీ చెల్లించుటకు బాధ్యుడగును.

కాని ఏ ఒక కేసులోనైనను కంట్రోలరు పినాల్టీ తగ్గించ వచ్చును.

**57.** ఛార్జీచేయదగిన యావదాస్తి మదింపు అఫిడవిట్టులో ఎగ్జిక్యూటరు చెప్పవలెను:

మరణించినవాని మరణము దరిమిలాను 6 మాసములలోగా, రిప్రిజెంటేషను నిమిత్తము దరఖాస్తుచేసిన అన్ని కేసులలోను,

(ఎ) తనకు బాగుగ తెలిసియున్నంతవరకు చనిపోయినవాని ఎగ్జిక్యూ టరు, కోర్టుఫీజు ఆక్టు 19-1 వ సెక్షనుక్రింద దాఖలుచేసిన మదింపు అఫిడవిట్టుతో జతపరచి, చనిపోయినమీదట ఎస్టేటు డ్యూటీ చెల్లించవలసిన యావదాస్తికి ఒక సరియైన ఎక్కవుం

టుయిచ్చి, అట్టి ఎక్కవుంటు నకలు ఒకటి కంట్రోలరుకు ఇవ్వవలెను. మరిన్ని,

(బి) క్లాజు (ఎ) లో చెప్పిన అక్కవుంటు ఇచ్చువరకున్ను, 60 వ సెక్షనుక్రింద లేక 67 వ సెక్షనుక్రింద, అట్టిఆస్తికి చెల్లించవలసిన ఎస్టేటుడ్యూటీ యావత్తు చెల్లించినట్లుగాని, చెల్లించుననిగాని, ఇంక బాకీలేదనిగాని, కంట్రోలరువద్దనుండి సర్టిఫికెట్టు హాజరుపరచేవరకున్ను రిప్రజెంటేషను గ్రాంటుచేయమని పెట్టినదరఖాస్తుపై, అది గ్రాంటుచేయునట్లు ఉత్తరువుచేయరాదు.

**58.** ఎస్టేటుడ్యూటీ ఎప్పుడు బాకీపడును. ఏవిధముగ ఎప్పుడువసూలు చేయబడును:

(1) మరణించినవాని మరణ తేదీలగాయతు ఎస్టేటుడ్యూటీ బాకీపడును. మరియూ 53 వ సెక్షనుక్రిందగాని 57వ సెక్షనుక్లాజు (ఎ) క్రిందగాని ఇచ్చిన ఎక్కవుంటుమీదగాని లేదా 61 వ సెక్షను 2 వ సబ్ సెక్షనుక్రింద తయారుచేసిన అక్కవుంటు మీదగాని వసూలుచేయబడును.

(2) ఈ ఆక్టుననుసరించి ప్యాయుచేసిన ఏ ఆర్డరువల్లనైనను ఎస్టేటుడ్యూటీగాని, పినాల్టీగాని, వడ్డీగాని, ఈ ఆక్టుక్రింద ఛార్జిచేయదగిన ఇతర మొత్తముగాని నిర్ధారణ చేయబడినప్పుడు, అక్కవుంటుచెప్పవలసినవ్యక్తిపైన నిర్ణయించబడు ఫారములో చెల్లించవలసిన మొత్తము, ఎప్పుడు ఎక్కడ చెల్లించవలసినదీ తెలుపుచు ఒకడిమాండు నోటీసు జారీచేయబడును.

**59.** ఎస్టేటుడ్యూటీ విధించుచర్యలు ప్రారంభించుటకు కాలదోషము : ఎవరిఆస్తికి ఎస్టేటుడ్యూటీ చెల్లించవలసివచ్చునో అట్టివానిమరణము లగాయతు 12 సంవత్సరములు దాటినతరువాత ఎట్టి ఎస్టేటుడ్యూటీ విధించు చర్యలు జరుప ప్రారంభించరాదు.

**60.** ఎక్కవుంటు ఇచ్చినమీదట డ్యూటీ చెల్లించవలెను లేదా డ్యూటీకి సెక్యూరిటీ ఇవ్వవలెను. అందుపై సర్టిఫికెట్టు యివ్వబడును :

53 వ సెక్షనుక్రింద లేక 57 వ సెక్షను క్లాజు (ఎ) క్రింద

అక్కౌంటు ఇచ్చినమీదట, ఇచ్చిన వ్యక్తి కంట్రోలరుకు ఎస్టేటు డ్యూటీ చెల్లించవలెను. లేదా, అక్కౌంటులో చేరిన ఆస్తికి చెల్లించవలసిన డ్యూటీ చెల్లించుటకు కంట్రోలరుకు తృప్తికరమైన సెక్యూరిటీ ఇవ్వవలెను. అందుపైన అట్టి డ్యూటీ చెల్లించినట్లు, లేక చెల్లించునని, లేక ఏమియు బాకీ లేదనియు సందర్భమును బట్టి ఒక సర్టిఫికెట్టు గ్రాంటుచేయవలెను.

**61.** మదింపు (వేల్యుయేషను) విషయమై కంట్రోలరుయొక్క పవరు :

(1) అక్కౌంటు ఇచ్చిన వ్యక్తి, ఎక్కౌంటులో చేర్చిన ఆస్తికి బాగా తక్కువ కిమ్మతు ఇచ్చుటవల్లగాని, లేక అందు చేర్చవలసిన ఆస్తి చేర్చకపోవుటవల్ల గాని డ్యూటీ చెల్లించవలసిన ఆస్తికి తక్కువమదింపు ఇచ్చినట్లు కంట్రోలరు అభిప్రాయపడిన యెడల, తనకు తగునని తోచినరీతిని, ఇందు విషయమై దరియాప్తు చేయవచ్చును. అప్పటికిన్ని అట్టి అభిప్రాయమునే కలిగియున్న యెడల, మదింపు సవరణచేయుమని ఆజ్ఞాపించవచ్చును. అట్లు ఆ వ్యక్తి సవరణచేయనియెడల, వానికి వినుటకవకాశ మిచ్చి, ఎస్టేటుడ్యూటీ విధించుట కాధారమైన మదింపు నిర్ధారణ చేయవచ్చును.

(2) 56 వ సెక్షను లేక 57 వ సెక్షను క్లాజు (ఎ) క్రింది అక్కౌంటు ఇవ్వని కేసులోను కంట్రోలరు తనకు తగునని తోచినరీతిని చనిపోయినవాని ప్యాసయే ఆస్తికి అక్కౌంటు తయారు చేయించవచ్చును. మరియు డ్యూటీకి అక్కౌంటు చెప్పదగిన వారని తనకు తోచినవారిని అట్టి మదింపు అంగీకరించుమని ఆజ్ఞాపించవచ్చును. అట్టి వ్యక్తి ఆ మదింపును అంగీకరించక పోయినను, లేక డ్యూటీకి తన బాధ్యతను అంగీకరించకపోయినను, అట్టి వ్యక్తి చెల్లించవలసిన ఎస్టేటుడ్యూటీ నిర్ధారణ చేయవచ్చును.

**62.** ఎస్టేటుడ్యూటీకి మదింపులో పొరపాట్ల సవరణ :

(1) ఏ ఎస్టేటుకైనను చెల్లించవలసిన ఎస్టేటుడ్యూటీ నిర్ధారణచేసిన తరువాత, రికార్డును బట్టి స్పష్టముగా తప్పు అని, లేక ఈ ఆక్టు క్రింద అప్పీలులో నున్న మదింపు గాక, ఏ ఇతర ఆస్తికైన మదింపులో పొరపాటున తప్పు అనిగాని, లేక ఏ ఆస్తి అయి నను వదలివేయుటవల్లగాని, చెల్లించిన ఎస్టేటుడ్యూటీ సరిగా చెల్లించవలసినదానికంటె ఎక్కువగా చెల్లించినట్లున్ను, లేక తక్కువగా చెల్లించినట్లున్ను కంట్రోలరుకు కనుపించినయెడల, తాను స్వతంత్రముగా గాని, లేక అక్కవుంటు చెప్పవలసిన వాని దరఖాస్తుమీదగాని, బోర్డువారి అనుమతి ముందుగా పొందనమీదట, ఎస్టేటుడ్యూటీ ప్రథమములో నిర్ణయించినది లగాయతు 3 సంవత్సరముల లోగా ఎప్పుడైనను,

(ఎ) ఎక్కువగా చెల్లించిన డ్యూటీ రిఫండు ఇవ్వవచ్చును, లేదా,

(బి) అదనముగా చెల్లించవలసిన డ్యూటీ నిర్ణయించవచ్చును. కాని, అక్కవుంటు చెప్పవలసిన వ్యక్తి దగాగా తక్కువ మదింపు ఇచ్చినను, ఆస్తి వదలివేసినను, కాలదోషం 6 సంవత్సరము లుండును.

మరియు, ఎక్కవుంటు చెప్పవలసిన వ్యక్తికి వినుట కవకాశ మివ్వకుండా ఈ సబ్ సెక్షనుక్రింద ఆర్డరు వేయరాదు.

(2) ఎస్టేటు డ్యూటీ చెల్లించివేసినట్లు సర్టిఫికెట్టు ఇవ్వబడిన ఏ వ్యక్తి నిన్ని, ఎస్టేటుడ్యూటీనుండి తప్పించుకొనుటకు దగాగా ప్రయత్నించినయెడల తప్ప, తన చేతిలోనున్న ఆస్తినిమించి ఏ అదనపు డ్యూటీనిన్ని చెల్లించుటకు బాధ్యుడుగా ఈ 1 వ సబ్ సెక్షనులోని దేదియు చేయలేదు.

**63.** కంట్రోలరు నిర్ధారణపైన అప్పీలు :

(1) (ఎ) (i) కంట్రోలరు వేసిన మదింపుకుగాని, లేక,

(ii) కంట్రోలరు ఎస్టేటుడ్యూటీ నిర్ణయించిన ఏ ఆర్డరుకు గాని లేక,

(iii) 56 వ సెక్షనుక్రింద కంట్రోలరు విధించిన ఏ పినాల్టీకి గాని, లేక,

(iv) ఏ ఆస్తిమీాదనైనను ఎస్టేటుడ్యూటీ చెల్లించుట లేక బాధ్యత కలుగచేయు ఏ ఫయినల్ ఆర్డరుకు గాని అభ్యంతరము కలిగినట్టిన్ని,

(బి) ఏ ఆస్తి విషయములోనైనను ఎస్టేటుడ్యూటీ లెఖ్ఖచెప్పు బాధ్యతయే లేదనునట్టిన్ని,

(సి) ఈ ఆక్టుక్రింద కంట్రోలరు డిశ్చార్జిసర్టిఫికెట్టు ఇవ్వ నిరాక రించుచు వేసిన ఆర్డరుకు అభ్యంతర పెట్టునట్టిన్ని, ఏవ్యక్తి యైనను 58 వ సెక్షను (ఎ), (బి) క్లాజులలో చెప్పబడిన డిమాండు నోటీసు ముట్టిన 90 రోజులలోపుననున్ను, క్లాజు (సి) లో చెప్పిన కేసులలో ఆర్డరు తేదీనుండి 90 రోజులలోనున్ను బోర్డువారికి, నిర్ణయించబడు ఫారములో నిర్ణయించబడునట్లు వెరిఫైచేసి అప్పీలు దాఖలు చేయ వచ్చును.

(2) అట్టి కాలములో దాఖలు చేయకపోవుటకు తగిన కారణము ఉన్నదని తృప్తిపొందినయెడల అట్టి గడువు దాటినమీాదట కూడా బోర్డువారు అప్పీలు అడ్మిట్టు చేయవచ్చును.

(3) ఏ అప్పీలైనను విచారించుటలో, బోర్డు, తనకుతోచిన ప్రకారము మరికొంత దరియాప్తు చేయవచ్చును. అప్పిలెంటుకు వినుటకు అవకాశమిచ్చి, 4వ సబ్ సెక్షనుకు లోబడి, అందుపై బోర్డుకు సరియైనదని తోచిన ఆర్డరును వేయువచ్చును. అట్టి

ఆర్డరున కళ్ళు ఒకటి అప్పిలెంటుకున్ను, ఒకటి కంట్రోలరుకు న్ను పంపవలెను.

(4) తగాయిదా ఆస్తిమదింపును గురించి అయిన్నప్పుడు, బోర్డునామినేటు చేయు వేల్యూయరు ఒకరున్ను అప్పిలెంటు నామినేటుచేయు వేల్యూయరు ఒకరున్ను కలసిన ఇద్దరు పంచాయతీదార్లకు బోర్డు అట్టితగాయిదాను రిఫరుచేయవచ్చును. అట్లు చేయుమని అప్పిలెంటే కోరినయెడల బోర్డురిఫరు చేసితీరవలెను. ఆరిఫరెన్సుకయ్యే ఖర్చులు ఎవరికోరికపై రిఫరుచేసిన, వారుభరించవలెను.

కాని, అప్పిలెంటు కోరికపై చేసినరిఫరెన్సులో అప్పిలెంటు పూర్తిగకాని, కొంతవరకూగాని, గెల్చినపుడు, ఎంతమట్టుకు ఖర్చులుఅప్పిలెంటుభరించవలెనోబోర్డుడిస్క్రిషనులోనుండును.

మరిన్ని, ఆఇద్దరు పంచాయితీదారుల అభిప్రాయములు వేరైనపుడు, ఉభయల అంగీకారముపై నామినేటు చేయబడునట్టిన్ని, లేక, అంగీకారములేనపుడు, కేంద్రప్రభుత్వము నామినేటు చేయునట్టిన్ని, 3వ వేల్యూయరుకు రిఫరుచేయవలెను. మదింపువిషయములో అట్టి 3వవాని తీర్పు ఆఖరితీర్పు అగును.

(5) 4వ సబ్ సెక్షను క్రింద పంచాయితీకి రిఫరుచేసిన ఏవిషయములోనైనను విచారించుటలో వారికితగునని తోచెడి దరియాప్తును, వేల్యూయర్లు చేయుటగాని, ఇతరులు చేయునట్లుగాని జరిగించవలెను. అట్లు విచారణచేయుటలో అప్పిలెంటుకు వినుటకవకాశమిచ్చి, తరువాత అందుపై తగునని తోచురీతినిఆర్డర్లుచేయుదురు. అట్టిఆర్డర్ల నకళ్ళు అప్పిలెంటుకున్ను బోర్డుకున్ను పంపవలెను.

(6) బోర్డుయెదుట అప్పీలు దాఖలుచేసినప్పటికిన్నీ, నిర్వివాదమైనంతమట్టుకు ఎస్టేటుడ్యూటీఅప్పిలెంటువల్ల చెల్లించబడవలెను.

**64.** బోర్డు హైకోర్టుకు కేసుస్టేటుచేయుట:

(1) 63వ సెక్షను 3వ సబ్ సెక్షను క్రింద ఆర్డరు అమలుజరుపబడిన తేదీ లగాయతు 90 రోజుల లోపున, అక్కౌంటు చెప్పవలసినవారు బోర్డుకు నిర్ణయించబడు ఫారములో అట్టి ఆర్డరునుండివచ్చెడి ఏలాపోయింటునైనను హైకోర్టుకు రిఫరు చేయుమని కోరుచు ఒక ధరఖాస్తుపెట్టవచ్చును. దానితో పాటు రు 100 లు ఫీజుకూడా కట్టవలెను. అట్టి ఆర్డరునుండి ఎట్టి లా ప్రశ్న అయిననూ ఉన్నదని తోచినయెడల, హైకోర్టు అభిప్రాయముకొరకు కేసును స్టేటుచేయవలెను.

కాని, గడువులోపున అట్టి ధరఖాస్తు పెట్టకపోవుటకు తగిన కారణము ఉన్నదనితృప్తిచెందినయెడల గడువుదాటినతరువాత కూడ బోర్డు అట్టిధరఖాస్తును ఎడ్మిటుచేసుకొనవచ్చును.

(2) 1వ సబ్ సెక్షనుక్రింద చేయబడినధరఖాస్తుమీాద బోర్డు

(ఎ) లా ప్రశ్న ఏమియులేదని కేసు స్టేటుచేయుటకు నిరాకరించినయెడల, లేక

(బి) కాలదోషం పట్టినదనేకారణముచేత దరఖాస్తు రిజెక్టుచేసినయెడలను,

నిరాకరణ, లేక రిజెక్టుచేసినట్లు నోటీసు అమలుజరిపిన 3 నెలలోపున, హైకోర్టుకు ఎక్కౌంటు చెప్పవలసినవారు ధరఖాస్తు పెట్టవచ్చును. అందుపై బోర్డువారితీర్పు సినదైనది అని తృప్తిచెందినయెడల, బోర్డువారిని కేసు స్టేటుచేయుమని అనవచ్చును. అందుపై బోర్డు కేసు స్టేటు చేయవలెను.

కాని, అక్కవుంటు చెప్పవలసినవ్యక్తి ఎవరైన కేసుస్టేటుచేయుమని కోరినప్పుడు, లా ప్రశ్న ఏమీరాదన్న కారణమున బోర్డు నిరాకరించినయెడల, అట్టినిరాకరణ నోటీసు అందిన 30 రోజులులోగా ఆవ్యక్తి తనధరఖాస్తు తీసివేసికొనవచ్చును. అట్లు చేసినమీదట 1వ సబ్ సెక్షనుకింద తాను చెల్లించిన ఫీజు వాపసు చేయబడును.

(3) హైకోర్టులో దాఖలుచేసెడి ధరఖాస్తుకు లిమిటేషను ఆక్టు 5వ సెక్షను వర్తించును.

(4) 1 వ సబ్ సెక్షనుకింద దాఖలుచేయబడిన ధరఖాస్తుపై అందువచ్చెడి లా ప్రశ్న చాల ముఖ్యమైనదన్న కారణముచేతనైనను, వివిధ హైకోర్టుల అభిప్రాయములు భేదించియున్నవన్న కారణముచేతనైనను సుప్రీమ్‌కోర్టుకు బోర్డు కేసుస్టేటుచేయుట న్యాయసిద్ధికి అగత్యమనిబోర్డు అభిప్రాయపడినయెడల, డైరెక్టుగా సుప్రీమ్‌కోర్టుకు అట్లు కేసు స్టేటుచేయవచ్చును.

(5) స్టేటుచేసెడి కేసులో విషయములను, బోర్డుయొక్క నిర్ణయమును కేసులోవచ్చిన లా ప్రశ్నయున్ను చెప్పవలెను.

(6) హైకోర్టుగాని, సుప్రీమ్‌కోర్టుగాని, చెప్పబడినకేసు చెప్పబడినట్లుండగా, లా ప్రశ్నమీద తీర్పు ఇచ్చుటకు చాలునని తృప్తిపడనియెడల, బోర్డుకు ఆ కేసు మార్చి చెప్పుమనిగాని, అదనముగా కేసుచెప్పుమనిగాని డైరెక్టు చేయవచ్చును.

(7) హైకోర్టుగాని సుప్రీమ్‌కోర్టుగాని అట్టికేసు విన్నమీదట, తీర్పు చెప్పవచ్చును. అట్లుచెప్పుటలో అవసరమని తోచినయెడల లా ప్రశ్నఫారము మార్చవచ్చును. అందుపై తీర్పుచెప్పవచ్చును. ఆతీర్పులో, తీర్పుకుగల ఆధారము చు చెప్పవలెను. ఆతీర్పునకళ్ళు ఆకోర్టుసీలుతోను, రిజిస్ట్రారు సంతకముతోను బోర్డుకు పంపవలెను. అందుపై ఆతీర్పుననుసరించి బోర్డుకేసు పరిష్కరింపవలెను.

(8) హైకోర్టుకుగాని, సుప్రీమ్‌కోర్టుకుగాని రిఫరెన్సుయొక్క ఖర్చులు ఆకోర్టువారి ఇష్టములోనుండును.

కాని, ఈ 4వ సబ్ సెక్షనుక్రింద కేసు రిఫర్ చేసినప్పుడు, హైకోర్టుకు రిఫరుచేసిన యెడల అయేఖర్చులుమాత్రం యివ్వ వలసివుంటే పార్టీ యివ్వవలెను.

(9) హైకోర్టుకుగాని, సుప్రీమ్‌కోర్టుకుగాని, రిఫరెన్సుచేయబడినప్పటి కిన్నీ బోర్డువారు నిర్ణయించినట్టి ఎస్టేటుడ్యూటీ చెల్లించవలసి యుండును.

(10) ఈ సెక్షనునిమిత్తము "హైకోర్టు"అనగా రిప్రెజెంటేషన్ నిమిత్తము రిప్రెజెంటేషనుకు ధరఖాస్తుచేసియున్న హైకోర్టు లేక అట్టి ధరఖాస్తుచేసియున్న సబార్డినేటుకోర్టుకు పై హైకోర్టు, లేదా అట్టిధరఖాస్తుచేసియుండనియెడల అట్టిధరఖాస్తు ఏ హైకోర్టులో దాఖలుచేయుటకు జూరిస్డిక్షను ఉండునో ఆహైకోర్టు.

అయితే పార్టు (సి) స్టేట్లలో 'హైకోర్టు' అనగా

(ఎ) అజ్మీరు, వింధ్యప్రదేశములలో అలహాబాద్ హైకోర్టు.

(బి) భూపాల్‌లో నాగపూర్ హైకోర్టు.

(సి) బైలాస్‌పూర్, ఢిల్లీ, హిమాచలప్రదేశములలో పంజాబ్ హైకోర్టు.

(డి) కూర్గులో మైసూరు హైకోర్టు.

(ఇ) కచ్చిలో బోంబే హైకోర్టు.

(ఎఫ్) మణిపురం త్రిపురలో అస్సాం హైకోర్టు.

(జి) అండమాన్, నికోబర్, ద్వీపములలో కలకత్తా హైకోర్టు.

**65.** హైకోర్టులో బెంచీలు వినదగినకేసులు, సుప్రీమ్‌కోర్టుకు అప్పీలు ఉండే కొన్ని కేసులు

(1) 64 వ సెక్షనుక్రింద హైకోర్టుకు కేసు స్టేటు చేయబడినప్పుడు, అది ఇద్దరకు తక్కువకాని బెంచీ వినవలెను. ఆజడ్జీల లేక మెజా

రిటీ జడ్జీల అభిప్రాయముప్రకారము పరిష్కరించబడును.

అయితే, అట్టిమెజారిటీ లేనియెడల భిన్నాభిప్రాయములు వచ్చిన లా పాయింటుస్టేటుచేసి, ఆ పాయింటుమీాద మాత్రం హైకోర్టులో మరియొక ఇతరజడ్జీ లేక జడ్జీలచేవినబడును. అందుపై మొదటవిన్న జడ్జీలు తరువాతజడ్జీలలో మెజారిటీ అభిప్రాయంప్రకారము పరిష్కరింపబడును.

(2) 64 వ సెక్షనుక్రింద స్టేటుచేయబడిన కేసులో హైకోర్టు ఇచ్చిన తీర్పుపై సుప్రీమ్‌కోర్టుకు అప్పీలుచేయదగినదని సర్టిఫై చేసిన కేసులో సుప్రీమ్‌కోర్టుకు అప్పీలుండును.

(3) 5 వ 1908 వ ఆక్టు సివిల్ ప్రొసీజరుకోడ్డులోని సుప్రీమ్‌కోర్టు అప్పీల్కు సంబంధించిన ప్రొవిజనులు హైకోర్టునుండి సుప్రీమ్‌కోర్టుకు చేయబడిన అప్పీలుకు వర్తించునట్లే వర్తించును.

కాని, ఈ సబ్ సెక్షనులోనిదేదిన్నీ 64 వ సెక్షను 7 వ సబ్ సెక్షనును మార్పుచేయునట్లెంచబడదు.

మరిన్నీ సుప్రీమ్‌కోర్టు ఆర్డరు ఖర్చులేమైనను ఇచ్చియున్న యెడల వారంటములునిమిత్తము హైకోర్టులో ధరఖాస్తుచేసిన మీాదట, హైకోర్టుకు సబార్డినేటు అయిన ఏ ఇతరసబార్డినేటు కోర్టుకైనను ట్రాన్స్మిటు చేయవచ్చును.

(4) ఈసెక్షనుక్రింద అప్పీలులో హైకోర్టుతీర్పు ఎట్లైననుమార్పు చేసినయెడల 64 వ సెక్షను 7 వ సబ్ సెక్షనులో చెప్పినవిధముగా ఆమార్పును చేయవలెను.

**66.** హైకోర్టుకు రిఫరెన్సు చేయబడినకారణముచేత, రిప్రిజెంటేషను గ్రాంటుచేయుట ఆలస్యముచేయరాదు.

**67.** డ్యూటీవసూలు సర్టిఫికెట్టు చెల్లించనందుకు పినాల్టీ

(1) 61 వ సెక్షను 1వ సబ్ సెక్షనుక్రింద కంట్రోలరు డైరెక్టుచేసిన ప్రకారము ఎక్కవుంటు చెప్పవలసినవ్యక్తి మదింపునసరణ చేసినప్పుడు, లేక 64 వ సెక్షనుప్రకారము బోర్డువారి రిఫరెన్సుపైన కోర్టువారు ఎక్కువచేసినప్పుడున్ను, మరిన్ని మదింపు చాలా తక్కువ అయియున్నట్లు కనిపెట్టబడినప్పుడున్ను, అట్టివ్యక్తి, అట్టినవరణ, ఎక్కువచేయుట, కనిపెట్టబడుట జరిగిన 2 మాసములలోపున, లో తక్కువ ఎస్టేటుడ్యూటీని చెల్లించవలెను. అందుపైన వానికి కంట్రోలరు ఒకసర్టిఫికెట్టు ఇవ్వవలెను.

(2) 64 సెక్షనుక్రింద బోర్డు రిఫరెన్సుపైన మదింపు తగ్గించబడినప్పుడు, వారికి ఆర్డరు అందిన 2 మాసములలోపున ఎక్కవుంటు చెప్పవలసిన వారివల్ల చెల్లించబడిన అదనపు డ్యూటీని రిఫండు చేయవలెను. ఆస్తికి చెల్లించవలసిన పూర్తి డ్యూటీ చెల్లించబడినదని వానికి ఒక సర్టిఫికెట్టు గ్రాంటు చేయవలెను.

(3) 53 వ సెక్షను లేక 57 వ సెక్షను క్లాజు (ఎ) ల ప్రకారము కావలసిన అక్కవుంటు డెలివరిచేయని కేసులలో 61 వ సెక్షను 2 వ సబ్ సెక్షనుక్రింద కంట్రోలరు తయారుచేసిన అక్కవుంటు అంగీకరించమని పిలువబడిన వ్యక్తి, అట్టి అంగీకారము లగాయతు, లేక 64 వ సెక్షనుక్రింద చేయబడిన రిఫరెన్సుమీాద ఆఖరు పరిష్కారము లగాయతు 2 మాసములలోపున ఆస్తికి చెల్లించవలసిన పూరాడ్యూటీని చెల్లించవలెను. అందుపై వానికి కంట్రోలరు ఒక సర్టిఫికెట్టు గ్రాంటుచేయవలెను.

(4) పై 1 వ లేక 3 వ సబ్ సెక్షను ప్రకారము చెల్లించవలసిన డ్యూటీ అక్కవుంటు చెప్పవలసిన వ్యక్తి, అందు చెప్పబడిన కాలములో చెల్లించనియెడల, రు 1000- లు లేక చెల్లించవల

సిన డ్యూటీకి రెట్టింపుసొమ్ము కంట్రోలరుకు తోచినది పినాల్టీ చెల్లించుటకు బాధ్యుడు.

కాని, ఏ ఒక కేసులోనైనను కంట్రోలరు పినాల్టీని తగ్గించ వచ్చును.

(5) చనిపోయినప్పుడు ప్యాసయే ఆస్తికి ఎస్టేటుడ్యూటీకి అక్కవుంటు చెప్పవలసిన వ్యక్తి, తనకు తెలిసినంతవరకున్ను నమ్మినంత వరకున్ను అట్టి మరణానంతరము ప్యాసయే ఆస్తి యేావత్తుకున్ను, ఎవరెవరికి హక్కు కలదిన్నీ స్టేటుమెంటు ఇచ్చినయెడల, అట్టి ఆస్తి చెల్లించవలసిన డ్యూటీ నిర్ణయించవచ్చును. అవి చెల్లించినయెడల, కంట్రోలరు వానికి సర్టిఫికెట్టు ఇవ్వవచ్చును.

**68.** వచ్చునని తలచు ఇంటరెస్టుపై డ్యూటీ కమ్యుటేషను :

వచ్చునని తలచు ఆస్తియందు ఇంటరెస్టుగల వ్యక్తియొక్క ధరఖాస్తుపైన, కంట్రోలరుకు ఇష్టమైనయెడల ముందు ఎప్పుడో అట్టి ఇంటరెస్టుపై చెల్లవలసిన ఎస్టేటుడ్యూటీని ఇప్పుడే చెల్లించెడి డ్యూటీగా మార్చ (కమ్యూటుచేయ) వచ్చును. అట్టి డ్యూటీ నిర్ణయించుటకు అందుపై ప్రస్తుతపు కిమ్మతును నిర్ణయించవలెను. అట్లు చేయుటలో డ్యూటీ చెల్లించుటకు గల బాధ్యత, రేటు మొత్తముల సందర్భముల గురించి 3% వడ్డీ లెఖ్ఖ కట్టి తేల్చవలెను, అట్టి మొత్తము చెల్లించినమీాదట కంట్రోలరు సర్టిఫికెట్టు ఇవ్వవలెను.

**69.** చిక్కులుగల కేసులలో విధానము :

ఆస్తి ప్యాసగుటకు ముందు సంభవించిన మరణముల సంఖ్యా లేక చనిపోగా వివిధ వ్యక్తులకు సంక్రమించిన హక్కుల చిక్కైన స్వభావము లేక మరి ఇతరమైన కారణములచేత ఏ ఆస్తికైనను, లేక అందలి ఇంటరెస్టుకైనను చెల్లించదగిన ఎస్టేటుడ్యూటీ

నిర్ణయించుటకు కష్టమైనప్పుడున్ను, లేక ఆస్తి పరిమితికి తగని ఖర్చులు అవకుండా అట్టి నిర్ణయము చేయుట కష్టమైనప్పుడున్ను, ఎక్కవుంటు చెప్పవలసిన ఏ వ్యక్తియొక్క అయినను ధర ఖాస్తుపైనిన్ని, ఆస్తియొక్క మొత్తము అందు సంక్రమించిన వివిధహక్కులు ఇంటరెస్టులున్ను, మరి ఇతరసందర్భములను గురించి, తనకు సాధ్యమైనంతవరకు సముజాయిషీ ఇచ్చినమీదటనున్ను, అట్టి ఆస్తి, ఇంటరెస్టులపై చెల్లవలసిన యావత్తు డ్యూటీల పరిష్కారరూపముగా సందర్భములను బట్టి న్యాయమని తోచే ఎస్టేటుడ్యూటీ మొత్తమును బోర్డు విధించవచ్చును. అట్లు విధించిన మొత్తమును అట్టి ఆస్తి, లేక ఇంటరెస్టుపై యావత్తు డ్యూటీ పూరా పరిష్కారముక్రింద బోర్డు అంగీకరించి, తదనుగుణముగా సర్టిఫికెట్టు ఇవ్వవలెను.

**70.** షరతులపై డ్యూటీ చెల్లింపుకు గడువు కంట్రోలరు ఇవ్వవచ్చును :

(1) ఏ ఆస్తికైనను విధించవలసిన ఎస్టేటుడ్యూటీ విశేష నష్టము పొందకుండా వెంటనే చెల్లించలేధని కంట్రోలరు తృప్తిపొందినప్పుడు, అవసరమని వారికి తోచినంతకాలము తోచినంత డ్యూటీని 4% లేక ఆస్తివల్ల వచ్చేడి అంతకన్న హెచ్చురేటున వడ్డీ ఇచ్చుపద్ధతినిన్ని, ఇంకా ఇతర షరతులపైనయున్ను చెల్లించుటకు గడువు యివ్వవచ్చును.

(2) 1 వ సబ్ సెక్షనులో చెప్పబడినదే కాకుండా, అక్కవుంటు చెప్పవలసినవాని ఇష్టప్రకారము స్థిరాస్తిపై ఎస్టేటుడ్యూటీ ఒక్కొక్క సంవత్సరము ఒక వాయిదా చొప్పున 8 సాంవత్సరిక వాయిదాలమీదగాని. లేక, 16 అర్ధ సంవత్సర వాయిదాల మీదగాని, మొదటి వాయిదా తేదీ లగాయతు 4% లేక. ఆస్తి వల్ల వచ్చే ఇంతకన్న హెచ్చురేటు వడ్డీతో చెల్లించవచ్చును. చెల్లించగా మిగిలిన డ్యూటీమీద ప్రతివాయిదాకు వడ్డీ అసలు

కు చేర్చబడి చెల్లించబడవలెను. కాని ఎప్పుడైనను మిగిలియు న్న డ్యూటీ వడ్డీతో సహా ఒక్కమారు చెల్లించవచ్చును. ఆస్తి విక్రయించినయెడల, క్రియము పూర్తికాగానే చెల్లించవలెను. అట్లు చెల్లించనియెడల 73 వ సెక్షనులో చెప్పినట్లు రాబట్టబడ వలెను.

'1. మరణమునుండి 20 సంవత్సరములు తరవాత నిలచియున్న డ్యూటీబాకీ బోర్డు తీసివేయవచ్చును :

ఏ మరణానంతరమైనను ఎస్టేటుడ్యూటీ చెల్లించవలసివచ్చి నది లగాయతు 20 సంవత్సరములు గతించిన తరువాత, అట్టి డ్యూటీ ఏమైనను చెల్లించకది గడియున్నయెడల, తగునని తో చినయెడల, బోర్డువారు ఎక్కవుంటు చెప్పవలసిన లేక చెల్లించ వలసిన లేక ఆస్తియందు ఇంటరెస్టుగల వ్యక్తియొక్క ధరఖాస్తు పైన, అట్టి బాకీ అంతయుగాని, కొంతగాని అందుపై వడ్డీగాని చెల్లించనక్కరలేకుండా తీసివేయవచ్చును.

'2. ఫారములు :

అన్ని అఫిడవిట్లు, అక్కవుంట్లు, సర్టిఫికెట్లు, స్టేటుమెంట్లు ఫారములు ఈ అక్టులోని ఈ భాగము నిమిత్తము, బోర్డు నిర్ణ యించెడి ఫారములో ఉండి, బోర్డు నిర్ణయించెడి వివరములను కలిగియుండును. బోర్డు కావలెనంటే, డ్యూప్లికేటులో నుండును. అక్కవుంట్లు,స్టేటుమెంట్లున్ను, ప్రమాణవచనముతో ఇవ్వవలెను. బోర్డు నిర్ణయించెడి విధముగ దస్తావేజులు, బుక్కులు కూడ జతపరచవలెను. ఈ సెక్షనులోని ప్రొవిజనులు ఎవరైనను బుద్ధి పూర్వకముగ తిరస్కరించినయెడల 56 వ సెక్షనులో చెప్పిన పినాల్టీకి బాధ్యులగుదురు.

**73.** డ్యూటీ రాబట్టుట, పినాల్టీలు :

ఈ ఆక్టుక్రింద చెల్లించవలసిన ఏ ఎస్టేటు డ్యూటీ అయినను లేక వసూలుపోగా మిగిలిన డ్యూటీయున్ను వడ్డీ లేక పినాల్టీయున్ను, కంట్రోలరు సర్టిఫికెట్టుపైన, ఇచ్చుటకు బాధ్యులైన వారివద్దనుండి ఏ స్టేటులోనైనను కలెక్టరువల్ల ల్యాండు రెవెన్యూవలె వసూలుచేయబడును.

## 8 వ భా గ ము.

ఆస్తిమీద డ్యూటీకి ఛార్జి: వసూలు చేయుటకు సదుపాయములు:

**74.** బాధ్యతగల ఆస్తిపై ఎస్టేటు డ్యూటీకి ప్రథమహామీ :

(1) మరణానంతరము ప్యానయే చర, లేక స్థిరాస్థిపైని ఎస్టేటుడ్యూటీకి, 19 వ సెక్షనుకు లోబడి, ఈ ఆక్టు 6 వ భాగములో మిన హాయింపు యివ్వబడిన ఋణములు, బాధ్యతలు పోను ఎవరియందు సంక్రమించినను, అట్టి ప్యానయే స్థిరాస్తిపైన ప్రథమ హామీ ఉండును. అట్టి ఆస్తికి ఎట్టి ప్రయివేటు ట్రాన్సుఫరు లేక వప్పగింత అయిననూ, ఆ ఎస్టేటులో ఉండే డ్యూటీ క్లయిముకు వ్యతిరేకముగా నున్నంతమట్టుకు ఎంతమాత్రము చెల్లదు.

(2) చనిపోయిన తరువాత చనిపోయినవాని లీగల్ రిప్రజెంటేటీవులు గాక, ఎవరికైనను ప్యానయే చరాస్తిలో స్వాధీనపు లాభకరమైన ఇంటరెస్టుయొక్క కిమ్మతుకు ప్రపోర్షనేటుగా నుండు ఎస్టేటుడ్యూటీలోని భాగమునకు అట్టి ఇంటరెస్టుపై ప్రథమ హామీ ఉండును.

కాని, నోటీసులేని సరియైన ప్రతి ఫలమునకు నిజముగా కొన్న క్రియదారు కట్టిహామీ ఉండదు.

(3) ఏ ఆస్తిలో ఏ భాగమైనను, చరాస్తిగాని స్థిరాస్థిగాని, ఈసెక్షనులోని ఛార్జినుండి, వారికి తగునని తోచిన షరతులపై విడుదల చేయవచ్చును.

**75.** కొన్ని కేసులలో ఎస్టేటుడ్యూటీ తీరుమానము :

67 వ సెక్షనుక్రింద కంట్రోలరు ఇచ్చిన, లేక 69 వ సెక్షను క్రింద బోర్డు ఇచ్చిన సర్టిఫికెట్టు అందులో చేరిన ఆస్తిన్ని ఎస్టేటుడ్యూటీ క్లయిమునుండి తప్పించును.

కాని, దగా లేక ముఖ్యమైన విషయములను తెలుపుటకు తప్పుట, ఎట్టి ఆస్తినిగాని వ్యక్తినిగాని ఎస్టేటుడ్యూటీ బాధ్యత నుండి తప్పించవు.

మరిన్నీ, దరిమిలాను చనిపోయినమీదట ప్యాసైనట్లు చూపబడిన ఆస్తినిగాని, ఆందుమీదట అందువల్ల చెల్లించవలసిన అదనపుడ్యూటీనిగాని మార్చదు.

కాని, సర్టిఫికెట్టులో చేరియున్న ఏ ఆస్తిపైన అయినను చెల్లించవలసిన మొత్తము డ్యూటీ అని యివ్వబడిన సర్టిఫికెట్టు నోటీసు లేకుండా నిజముగా సరియైన ప్రతి ఫలమునకు క్రియము పొందిన క్రియదారుని దగా, లేక తెలుపుటకు తప్పుట జరిగి నప్పటికిన్నీ, డ్యూటీనుండి తప్పించును.

**76.** కొన్ని కేసులలో ట్రస్టీలున్ను హక్కుదార్లున్ను ఎక్కవుంటు చెప్పవలసిన వారికి తిరికి యిచ్చుట :

53 వ సెక్షనుక్రింద అక్కవుంటు చెప్పవలసిన వ్యక్తి తనకు రాని ఆస్తికి ఎస్టేటుడ్యూటీలో ఏ భాగమైనను చెల్లించినయెడల, ఆస్తియొక్క ట్రస్టీలు లేక హక్కుదారులు, సమయము వచ్చినప్పుడు ఆ డ్యూటీని వానికి ఇచ్చివేయవలెను.

**77.** డ్యూటీ చెల్లించుటకు సదుపాయములు :

(1) ఏ ఆస్తినైనను ఎస్టేటు డ్యూటీ చెల్లించుటకు అధికారము కలిగి

యుందు లేక, ఆజ్ఞాపించబడు, వ్యక్తి డ్యూటీ చెల్లించునిమిత్తం లేక చెల్లించిన డ్యూటీ రాబట్టుటకు ఆస్తి తనయందు వెస్టు అయి యున్నను, కాకపోయినను, అట్టి డ్యూటీయున్ను, వడ్డీయున్ను, సక్రమముగా ఇందు నిమిత్తము చేయబడిన ఖర్చులున్ను, ఆ ఆస్తి క్రియము లేక తణఖా, లేక ఛార్జివల్ల రాబట్ట వచ్చును.

అయితే, అట్టి క్రియము, తణఖా లేక ఛార్జిలకు ప్రతిఫలముగా యివ్వవలసిన సొమ్ము (ఎస్టేటు డ్యూటీకి సరిపోవునంత మట్టుకు) అట్టి క్రియము, తణఖా లేక ఛార్జిచేసినవానికి కాక, క్రియముపొందెడి తణఖా పట్టెడి, లేక ఛార్జి పొందెడివాని అప్ప నుపకారము కంట్రోలరుకు చెల్లించవచ్చును.

(2) ఆస్తియందు దేట్టి ఇంటరెస్టు అయినను ఉండి, ఆ ఆస్తికి ఎస్టేటు డ్యూటీ చెల్లించిన వ్యక్తి, తనకే తనఖాపెట్టి డ్యూటీ సొమ్ము రాబట్టినయెడల తనకు ఉండునట్టి ఛార్జీకి హక్కు కలిగి యుండును.

(3) ఒక సెటిల్మెంటులోని ఆస్తి లేక, సెటిల్మెంటు ప్రకారము ట్రస్టీలు వృద్ధిచేయవలసిన ఆస్తి క్రియమువల్ల తయారుచేయ బడిన ఏ సొమ్ము అయినను సెటిల్మెంటులోని ఆస్తికి ఎస్టేటు డ్యూటీ చెల్లించే నిమిత్తము ఖర్చుపరచవచ్చును.

## 9 వ భాగము చిల్లర అమాంబాపతు.

### 78. కొన్ని కేసులలో కోర్టులకు జూరిస్డిక్షను లేకపోవుట :

ఈ ఆక్టుక్రింద నిర్ణయించబడిన ఎస్టేటు డ్యూటీని రద్దు లేక మార్పు చేయుటకు ఏ సివిలుకోర్టులోను దావా ఉండదు. ఏ గవర్నమెంటు ఆఫీసరుమీదను సదుద్దేశముతో ఈ ఆక్టు క్రింద ఏ చర్యలమీదను ఎట్టి ప్రాసిక్యూషను దావా ఇతర ప్రొసీడింగ్సు, ఉండవు.

**79.** ప్రమాణ వాంగ్మూలము తీసికొనుటకు అధికారము :

వేల్యూయరుగాక 4 వ సెక్షను 1 వ సబ్ సెక్షనులోని ప్రతి అధికారి, ఈ ఆక్టు నిమిత్తము ఈ క్రింది విషయములలో (5 వ 1908 వ ఆక్టు) సివిలు ప్రొసీజరుకోడ్డు క్రింది, కోర్టుకు దావా విచారణ చేయుటకు ఉండెడి అధికారములు ఉండును.

(ఎ) ఏ వ్యక్తినైనను హాజరు పెట్టుటకున్ను ప్రమాణముపై విచారించుటకున్ను,

(బి) దస్తావేజులు తెలుపుటకున్ను చూపుటకున్ను,

(సి) అఫిడవిట్టు రూపకముగా సాక్ష్యం పుచ్చుకొనుటకున్ను,

(డి) సాక్షులను విచారణ చేయుట నిమిత్తము కమిషనులు జారీ చేయుటకున్ను,

మరియు, అట్టి ఏ అధికారి యెదుటనైనను జరిగే ప్రొసీడింగ్సు XLV వ 1860 ఆక్టు) ఇన్డియన్ పినల్ కోడ్డు 193,228 సెక్షనులలో చెప్పిన జుడిషల్ ప్రొసీడింగ్సుగా ఎంచబడును.

**80.** పబ్లిక్కు సర్వెంటు సముజాయిసీ తెలుపుట :

ఈ ఆక్టుక్రింది అన్ని ప్రొసీడింగ్సులోను, అందు సంబంధించి చూపబడిన లేక, తేబడిన అన్ని ఎక్కవుంట్లు, స్టేటుమెంట్లు, దస్తావేజులు, సాక్ష్యము లేక అఫిడవిట్లను, ఇన్డియన్ ఇన్కంటాక్సు ఆక్టు 1952 (XI of 1922) లోని 54 వ సెక్షను వర్తించును.

కాని, ఈ ఆక్టు నిమిత్తము గాని, ఇన్కంటాక్సు ఆక్టుక్రింద గాని, వానికి తెలుపవలసిన అవసరము, అగత్యము ఉన్న విషయములకు ఈఆక్టుక్రింద అమలు జరుపుటలో పనిచేయువ్యక్తికి అట్టి విషయములు తెలుపుటలో ఇన్కంటాక్సు ఆక్టు 54 వ సెక్షను వర్తించదు.

**81.** సముజాయిషీ సప్లయిచేయుటకు స్టేట్లతో అరేంజిమెంట్లు :

ఈ ఆక్టుక్రిందగాని, అట్టి అమలులో నున్న ఇతర లా క్రింద గాని, చెల్లించవలసిన ఎస్టేటుడ్యూటీ విధించుటలోను, వసూలు చేయుటలోను, అవసరమైన సంజాయిషీ పరివర్తనకు, కేంద్ర ప్రభుత్వము ఎస్టేటు గవర్నమెంటుతో నైనను ఏర్పాట్లు చేయ వచ్చును.

**82.** నోటీసులు అమలు :

ఈ ఆక్టుక్రింది ఏ నోటీసు అయినను, లేక రెక్విజిషను అయి నను, అందు చెప్పినవారిపై రిజిష్టరు పోస్టుద్వారా నైనను లేక సివిలు ప్రొసీజరుకోడ్డుక్రింద సమను జారీచేయు నట్లైయినను అమలు జరుపవచ్చును.

**83.** అథారిటీగల రిప్రజెంటేటివుల ద్వారా హాజరు :

79 వ సెక్షను ప్రకారము స్వయముగా హాజరు కావలసి ఉండిన తప్ప, 4 వ సెక్షను 1 వ సబుసెక్షనులో చెప్పిన అధి కారులయెదుట ఈ ఆక్టుక్రింద ఏ ప్రొసీడింగును సంబంధించినైనను హాజరగుటకు హైటుగల, లేక హాజరు కావలసిన లేక ఎస్టేటు డ్యూటీకి ఎక్కవుంటు చెప్పవలసిన ప్రతివ్యక్తినిన్ని, ఇందు నిమి త్తము వ్రాతమూలముగ అధికార మివ్వబడిన బంధువునుగాని, అతనివల్ల రెగ్యులరుగా నియమించబడినవారుగాని, లేక లీగల్ ప్రాక్టిషనరు లేక ఛార్టర్డు ఎక్కవుంటెంటు ద్వారాగాని, హాజరు కావచ్చును.

వివరణము : ఈ సెక్షనులో,

(ఎ) ఎక్కవుంటు చెప్పవలసినవారిచే రెగ్యులర్‌గా నియమించబడిన వారిలో, ఎక్కవుంటు చెప్పవలసిన వ్యక్తి కరెంటు ఎక్కవుంటు

ఉంచిన, లేక రెగ్యులర్‌గా డీలింగ్సు గల షెడ్యూల్డు బ్యాంకు లోని ఏ ఆఫీసరైనను కూడియుండును.

(బి) 'లీగల్ ప్రాక్టీషనరు' అనగా ఈ ఆక్టు వ్యాపించియున్న స్టేటుల లోని హైకోర్టు ఎడ్వొకేటు వకీలు లేక ఎటార్నీయున్ను అగు ను. మరియు అట్టి టెరిటరీలో ఏ భాగమందైనను ప్రాక్టీసు చేయుచున్న ప్లీడరుకూడా అగును.

(సి) 'ఛార్టర్డు ఎక్కవుంటెంటు' అనగా చార్టర్డు ఎక్కవుంటెంట్సు ఆక్టు 1949 (XXXVIII of 49) లో నిర్వచింపబడిన ఛార్టర్డు ఎక్కవుంటెంటు.

**84.** కంపెనీలో చనిపోయిన మెంబర్ల తబిశీళ్ళు కంట్రోలర్కు తెలుపుట :

(1) హిందూదేశము బైట ఇన్కార్పొరేటు అయిన కంపెనీ ఈఆక్టు వ్యాపించియున్న రాష్ట్రములలో వ్యాపారము చేయుచుండి, ఇన్డియన్ ఇన్కంటాక్సు ఆక్టు నిమిత్తము గత మూడింటిలో రెండు ఎసెస్మెంట్లకు రెసిడెంటుగా ఎంచబడుకంపెనీ, అందలి ఏ మెంబరైనను ఈ ఆక్టు అమలులోనికి వచ్చిన తరువాత చని పోయినట్లు వార్త వచ్చిన 3 మాసములలోగా కంట్రోలరుకు అట్టి మెంబరుయొక్క షేర్లను గురించి నిర్ణయింపబడు వివరము లను ఇవ్వవలెను. మఱియు, చనిపోయిన మెంబరు హిందూ దేశములో నివసించుచుండి, ఎస్టేటుడ్యూటీ చెల్లించినట్లు, లేక చెల్లించునని, లేక బాకీలేదు అని కంట్రోలరు వద్దనుంచి ఎక్క వుంటు చెప్పవలసిన వ్యక్తి సర్టిఫికెట్టు పొందియుంటే తప్ప, 2వ షెడ్యూలు 3 వ భాగములో చెప్పబడిన రేట్లప్రకారము చని పోయిన మెంబరుయొక్క షేర్ల అసలు కిమ్మత్తుపై ఎస్టేటు డ్యూటీ చెల్లించవలెను.

(2) ఇన్డియన్ కంపెనీల ఆక్టు 1913 (VII ఆక్టు 1913) క్రింద ఏర్పడి రిజిష్టరైన కంపెనీలోని మెంబరు ఎవరైన ఈ ఆక్టు అమలులోనికి వచ్చినతరువాత చనిపోయినయెడల 18 వ సెక్షనులో నిర్వచింపబడిన ఆ కంపెనీ ముఖ్య ఉద్యోగిద్వారా ఆ విషయము తెలిసికొన్న యెడల, చనిపోయిన మెంబరుపేరనున్న షేర్లను ట్రాన్సుఫరు పొందినవారు కిమ్మత్తైన ప్రతిఫలమునకు ఆ షేర్లను సంపాదించినట్లు కంపెని తృప్తిపొందిన తప్పయును, లేదా కంపెనీ యెదుట కంట్రోలరు వద్దనుండి ఎస్టేటుడ్యూటీ చెల్లించినట్లు, లేక చెల్లించుట, లేక బాకీలేదు అని సర్టిఫికెట్టు చూపిన యెడల తప్పయున్ను, కంపెని ట్రాన్సుఫరు రిజిష్టరు చేయుట న్యాయ విరుద్ధము.

(3) 1,2 సబ్ సెక్షనులలోని ప్రొవిజనులు ప్రకారము జరుపుటకు తప్పిన ఏ కంపెనీ అయినను రు 1000- లు లేక కంట్రోలరు ఇష్టము చొప్పున చెల్లించవలసిన ఎస్టేటు డ్యూటీకి రెట్టింపు మొత్తము పినాల్టీకి బాధ్యతకల దగును.

కాని, ఏ కేసులోనైనను కంట్రోలరు పినాల్టీ తగ్గించవచ్చును.

**85.** నిబంధనలు చేయుటకు బోర్డు పవర్లు :

కేంద్రప్రభుత్వము కంట్రోలుకున్ను, ముందుగా ప్రచురణ చేయు పద్ధతికిన్ని లోబడి, ఈ ఆక్టుకు వ్యతిరేకము కాకుండా, ఈ ఆక్టులో నిర్ణయింపవలసినట్లు, లేక పర్మిట్టు చేయవలసినట్లు చెప్పబడి అన్ని విషయములు నిర్ణయించునట్టివిన్ని, లేక ఈ ఆక్టు యొక్క ఉద్దేశములు నెరవేర్చుటకు, లేక అమలు జరుపుటకు అవసరము, లేక అనుకూలము అయినట్టివిన్ని, నిబంధన లన్నిటిని బోర్డు చేయవచ్చును.

(2) ఈ సెక్షను ఇచ్చిన నిబంధనలు చేయు అధికారములో మొదట వినియోగించినప్పుడు అట్టి నిబంధనలు ఆక్టుకంటె వెనుకనుంచి కాకుండా, నిబంధనలు చేయుటకు వెనుకనుంచి కూడా అమలులోనికి వచ్చునట్లు చేయు అధికారము కూడియుండును.

## 1 వ షెడ్యూలు

(5 వ సెక్షను చూడు.)

వ్యవసాయపు భూములపై ఎస్టేటుడ్యూటీ విధించవచ్చునట్టి స్టేట్లు :

| | | |
|---|---|---|
| బోంబే | ఉత్తరప్రదేశము | సౌరాష్ట్రము |
| మధ్యప్రదేశము | హైదరాబాదు | పార్టు C స్టేట్లు |
| ఒరిస్సా | మధ్యభారత | అన్నియు |
| పంజాబు | రాజస్థాన్ | |

## 2 వ షెడ్యూలు :

(5, 35, 81 సెక్షనులు చూడుము.)

ఎస్టేటు డ్యూటీ రేట్లు.

### 1 వ భాగము.

మితక్షర, మారుమక్కతాయం, అల్యశాంతనలాలు వర్తించు జాయింటు హిందూకుటుంబాస్తులలోని ఇంటరెస్టు అయియున్న ఆస్తి :—

(1) ఎస్టేటు అసలు కిమ్మతులో మొదటి రు 50,000 ల మీద డ్యూటీ లేదు.

| | | |
|---|---|---|
| (2) తరువాత | 50,000 | 5% |
| (3) డిటో | 50,000 | 7½% |
| (4) డిటో | 50,000 | 10% |
| (5) డిటో | 1,00,000 | 12½% |
| (6) డిటో | 2,00,000 | 15% |
| (7) డిటో | 5,00,000 | 20% |
| (8) డిటో | 10,00,000 | 25% |
| (9) డిటో | 10,00,000 | 30 % |
| (10) డిటో | 20,00,000 | 35% |
| (11) మిగతా అసలు కిమ్మతుమీద | | 40% |

## 2 వ భాగము.

మరి యే విధమైన ఇతరాస్తి విషయములోను,

| | | |
|---|---|---|
| (1) ఎస్టేటు అసలు కిమ్మతులో మొదటి రు 1,00,000 ల మీద డ్యూటీ | | లేదు. |
| (2) తరువాత | 50,000 | 7½% |
| (3) డిటో | 50, 000 | 10 % |
| (4) డిటో | 1,00, 000 | 12½% |
| (5) డిటో | 2,00,000 | 15 % |
| (6) డిటో | 5,00,000 | 20 % |
| (7) డిటో | 10,00,000 | 25 % |
| (8) డిటో | 10,90,000 | 30 % |
| (9) డిటో | 20,00,000 | 35 % |
| (10) మిగతా అసలు కిమ్మతుమీద | | 40 % |

## 3 వ భాగము :

84 వ సెక్షను 1 వ సబ్ సెక్షనులో చెప్పిన చనిపోయిన కంపెనీ మెంబరు షేర్ల విషయములో,

(1) షేర్ల అసలు కిమ్మతు రు 5,000 లు మించనంతవరకు డ్యూటీ లేదు.

(2) షేర్ల అసలు కిమ్మతు రు 5000- లు మించినతరువాత 7½%.

నోటిఫికేషనులు:

ేటుడ్యూటీ ఆక్టు 15 వ అక్టోబరు 1953 నుండి అమలు
నికి వచ్చునని 8-10-53 వ తేదీని కేంద్రప్రభుత్వమువారు
చురించిన గెజిట్టులో యస్. ఆర్. ఓ. నెం. 1882 రు నోటి
షను ఉన్నది.

్యూంటాక్సుక్రింద పనిచేయుచున్న ప్రతీ ఇన్కంటాక్సు కమీ
ారు ఎస్టేటుడ్యూటీ ఆక్టు 4 వ సెక్షను 2 వ సబ్ సెక్షను
ద కంట్రోలరుగానున్ను, ప్రతీ ఇకాస్పెక్టింగు అసిస్టెంటు కమి
ారు, డెప్యూటీ కంట్రోలరుగానున్ను, ప్రతీ ఇన్కంటాక్సు
సరు అసిస్టెంటు కంట్రోలరుగాను పనిచేయుదురని 15-10-53
తేదీని ప్రచురించిన ఇండియా గెజిట్టు 2 వ భాగం 3 వ
క్షను ఎక్స్ట్రా ఆర్డినరీ పేజీ 3223 లో యస్. ఆర్. ఓ. నె
38 రు నోటిఫికేషను వచ్చినది.

్ట్రోలర్లను ఎప్పాయింటు చేయుచు వారియొక్క అధికార
ులు, డ్యూటీలు నిర్ణయించుచు 4-12-53 వ తేదీ గల ఎస్.
ర్. ఓ. నెం 2246 రు నోటిఫికేషను వచ్చినది.

ుస్. ఆర్. ఓ. నెం. 491 ప్రకారము ఈ ఆక్టుక్రింద కంట్రో
కంపెనీలకు సంబంధించిన నిబంధనలు 13-2-54 వ తేదీగల
ండియా గెజిట్టులో 2 వ భాగములో 3 వ సెక్షనులో 339 వ
జీలో ప్రచురణ అయినవి.

స్టేటుడ్యూటీ నిబంధనలు. 13-2-54వ తేదీగల ఇండియా గెజిట్టు
వ భాగము 3 వ సెక్షను ఎక్స్ట్రా ఆర్డినరీ పేజీ 137 లో
ుస్. ఆర్. ఓ. నెం 556 రున ప్రచురింపబడినవి.

# ఎస్టేటుడ్యూటీ నిబంధనలు:

**1.** (1) క్లుప్తనామము. ప్రారంభము :

ఈ నిబంధనలు 1953 వ ఎస్టేటుడ్యూటీ నిబంధనలనబడ వచ్చును.

(2) ఇవి 15-10-53 వ తేదీని అమలులోనికి వచ్చినట్లెంచబడును,

## 1 వ భా గ ము ప్రి లి మి న రీ

**2.** నిర్వచనములు :

సందర్భము ఇంకొకలాగున ఉండవలసి వచ్చిన తప్ప ఈ నిబంధనలలో

(ఎ) 'ఆక్టు' అనగా 1953 వ ఎస్టేటుడ్యూటీ ఆక్టు.

(బి) 'అక్కవుంటు చెప్పవలసిన వ్యక్తి' అనగా ఈ ఆక్టుక్రింద ఎక్కవుంటు ఇచ్చుటకు బాధ్యతగల లేక డ్యూటీ చెల్లించుటకు బాధ్యతగల ఏ వ్యక్తియైనను,

(సి) 'డ్యూటీ' అనగా ఈ ఆక్టుక్రింద విధింపబడు ఎస్టేటు డ్యూటీ

(డి) 'ఇన్కంటాక్సు ఆక్టు' అనగా 1922 వ సం॥రపు ఇన్డియన్ ఇన్కంటాక్సు ఆక్టు (XI of 22),

(ఇ) 'ఇండియా' అనగా జమ్ము కాశ్మీరములు గాక హిందూ దేశములోని పరిదేశములు.

## 2 వ - భా గ ము

కేసులు ట్రాన్సఫరున్ను, అందుపై ప్రొసీజరున్ను.

(4 వ సెక్షను 2 వ సబ్ సెక్షను.)

సెకండుక్లాసు సర్వీసులో నున్న ఇన్కంటాక్సు ఆఫీసరైన అసిస్టెంటు కంట్రోలరు గాని, లేక ఫస్టుక్లాసు సర్వీసులో నున్న ఇన్కంటాక్సు ఆఫీసరైన అసిస్టెంటు కంట్రోలరు అయినను డెప్యూటీ కంట్రోలరు అయినను గాని, తనవద్ద పెండింగులో

నున్న కేసులోని ఎస్టేటు అసలు కిమ్మతు తన జూరిస్డిక్షను మొత్తమును మించవచ్చునని కనుగొన్నప్పుడు,

(ఎ) సెకండుక్లాసు సర్వీసులో నున్న ఇన్కంటాక్సు ఆఫీసరు అయితే ఈ విషయమై కంట్రోలరు సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువువల్ల నియమించునట్టిన్నీ ఫస్టుక్లాసు ఇన్కంటాక్సు ఆఫీసరైనట్టిన్నీ అసిస్టెంటు కంట్రోలరుకు ఆ కేసు ట్రాన్స్ఫరు చేయవలెను.

(బి) ఫస్టుక్లాసు సర్వీసులోని ఇన్కంటాక్సు ఆఫీసరైన అసిస్టెంటు కంట్రోలరైతే ఆ ఎస్టేటుమీద జూరిస్డిక్షను ఉండే డిప్యూటీ కంట్రోలరుకున్ను,

(సి) డెప్యూటీ కంట్రోలరైతే ఆ ఎస్టేటుమీద జూరిస్డిక్షనుండే కంట్రోలరుకున్ను ట్రాన్స్ఫరుచేయవలెను.

4. (ఎ) 3 వ నిబంధన ప్రకారము కేసు ఎవరికి ట్రాన్స్ఫరు చేయబడెనో అట్టి కంట్రోలరు, డెప్యూటీ కంట్రోలరు లేక అసిస్టెంటు కంట్రోలరున్ను ఏ స్టేజిలో నుండగా తనకు ట్రాన్స్ఫరు చేయబడెనో ఆస్టేజినుండి ఆ ప్రొసీడింగు ప్రారంభించి చేయవచ్చును, లేదా మరల మొదటినుండియు ప్రారంభము చేయవచ్చును.

కాని, మరల ప్రారంభించుటకు ముందు డ్యూటీకి అక్కవుంటు చెప్పవలసిన వ్యక్తిని వినుట కవకాశ మివ్వవలెను.

(బి) 3 వ నిబంధన ప్రకారము ఎస్టేటు కేసు ఎవరికి ట్రాన్స్ఫరు చేయబడెనో అట్టి అధారిటీయొక్క జూరిస్డిక్షనుకంటె ఎస్టేటు అసలు కిమ్మతు తక్కువ ఉన్నదనే కారణమువల్ల వాని జూరిస్డిక్షను ప్రశ్నించరాదు.

5. అసిస్టెంటు కంట్రోలరు, డెప్యూటీ కంట్రోలరు, లేక కంట్రోలరు వరుసగా ఇన్కంటాక్సు ఆఫీసరు, ఇన్స్పెక్టింగు అసిస్టెంటు కమిషనరు, లేక కమిషనరుగా, చనిపోయినవాని ఎస్టేటు విషయంలో పనిచేయుచుండకపోయినను, అట్టి ఎస్టేటు విషయము

లో 4 వ సెక్షను 2 వ సబ్ సెక్షను 2 వ ప్రొవైజో క్రింద కేసు ప్రత్యేకము వానిని చూడమనినయెడల కంట్రోలరు అధికారము చలాయించవచ్చును.

6. (1) 3 వ నిబంధనలోని దేనితోను నిమిత్తములేకుండా, ఒక ఎస్టేటుకు సంబంధించిన ప్రొసీడింగును బోర్డు ఏ స్టేజిలో నైనను ఒక అధికారివద్దనుండి మరియొకరికి ట్రాన్స్ఫరు చేయవచ్చును. అందుపై 4 వ నిబంధన వర్తించును.

(2) ఈ ఆక్టుక్రింది ఏ ప్రొసీడింగు విషయమై ఏ కంట్రోలరు, డెప్యూటీ కంట్రోలరు లేక అసిస్టెంటు కంట్రోలరు అయినను జూరిస్డిక్షను చలాయించుట మానివేసినయెడల క్రొత్తగా వచ్చినవారు ఆ ప్రొసీడింగును కంటిన్యూ చేయవచ్చును.

కాని, అక్కవుంటు చెప్పవలసిన వ్యక్తి క్రొత్త అధికారిని పునర్విచారణ చేయమనిగాని, డ్యూటీ విధించుచు ఎట్టి ఆర్డరైనను ప్యాసు చేయుటకు ముందు తనను వినుటకవకాశ మియ్యమనిగాని కోరవచ్చును.

## 3 వ భా గ ము.

### ఎసెట్ల స్వభావమున్ను ఉనికి స్థలమున్ను :

(21 వ సెక్షను 2 వ సబ్ సెక్షను.)

7. ఆస్తిస్వభావము నిశ్చయించుట :

ఎస్టేటుడ్యూటీ నిమిత్తము మరణానంతరము ప్యాసయే ఆస్తిలో భాగమైయుండు లేక భాగమైయుండు నట్లెంచబడు ఎసెట్ల స్వభావము ఈ క్రింది క్లాజుల ప్రకారము నిశ్చయింపవచ్చును:—

(ఎ) 'స్థిరాస్తి' అనే పదములో భూమి, భూమిని కప్పియుండు నీరు, ఇండ్లు, దారి హక్కులు, దీపములు, రేవులు (ఫెర్రీలు) లేక చేపలుండు స్థలములు లేక భూమినుండి వచ్చు ఏలాభ

మైనను ( ఈ నిబంధనలలో ప్రత్యేకముగ నిర్ణయించబడిన మాదిరి లాభములు గాక) మరియు భూమికి అతికియుండు వస్తువులకు స్థిరముగ కట్టబడియుండు వస్తువులున్ను, కూడియుండును. నిలువున పెరుగుచుండు చెట్లు, సస్యములు, పచ్చిగడ్డియున్ను మాత్రము కూడియుండవు.

వివరణము : భూమిలో అతికియుండుట' అనగా,

(i) భూమిలో చెట్లవలె వ్రేళ్ళు పారియుండుట, లేక, డొంకలు.

(ii) గోడలు, ఇండ్లవలె భూమిలో పునాది కలిగియుండుట.

(iii) అట్టి పునాది కలిగియున్న వాటియొక్క స్థిరమైనట్టిన్ని లాభకరమైనట్టిన్ని అనుభవము నిమిత్తము అంటియుండుట.

(బి) తణఖా షరతులప్రకారము తణఖా స్తి స్వాధీనము పొందుటకు రైటు కలిగియుండి, నిజముగా స్వాధీనముపొందియున్నట్టిగాక తణఖా పట్టినవానికి తణఖా ఆస్తియందుండు ఇంటరెస్టు చరాస్తియే అగును.

(సి) పార్ట్నర్‌షిప్పులలో పార్ట్నరుకు ఉండు వాటా, స్వభావమున్ను, ఉనికి స్థలమున్ను నిశ్చయించు నిమిత్తము పంపకము చేయుటకు వీలులేని ఎసెట్టుగా ఎంచబడును. ఫరంక స్థిరాస్థి ఉన్నను అట్టి వాటా, చరాస్తి అగును.

(డి) కంపెనీకి స్థిరాస్తి ఉన్నప్పటికిన్ని కంపెనీలో మెంబరుకు ఉండు షేరు, లేక ఇతర ఇంటరెస్టు చరాస్తి అగును.

(ఇ) స్థిరాస్తిపై హామీా ఉన్న ఒక బాకీలేక, వాయిదాల మీాద ఇచ్చు ఇతర పేమెంటు చరాస్తి అగును.

(ఎఫ్) ఎడ్మినిస్ట్రేటరు కాని ఎస్టేటులో బెనిఫిషియరీకి ఉండే ఇంటరెస్టు చరాస్తి అగును.

(జి) చరాస్తి అనగా స్థిరాస్తి గాక ఇతర అన్నివిధములైన ఆస్తులున్ను అగును.

**8.** చరాస్థి ఉనికి ప్రదేశము :

మరణానంతరము వ్యాసయే ఆ స్తిలో చేరియుండు, లేక చేరియుండు నన్లెంచబడు చరరూపకమైన ఎసెట్ల ఉనికి స్థలము ఈ దిగువ క్లాజుల ప్రకారము నిర్ణయించబడును:-

(ఎ) స్థిరాస్తిపై హామీ హక్కుగాక, స్థిరాస్తియందుండు రైట్లు, ఇంటరెస్టులు, ఆ స్థిరాస్తి ఉండియున్న చోటనే ఉన్నట్లెంచబడును,

(బి) ఈ నిబంధనలలో ప్రత్యేకముగ ఏర్పాటు చేసినవిన్ని, హామీ హక్కులున్న కాక, చరాస్తియందుండు రైట్లు, ఇంటరెస్టులున్న, బ్యాంకు నోట్లు, కరెన్సీనోట్లు, జారీచేయు చోట లీగల్ టెండరుగా అంగీకరింపబడు ఇతర కరెన్సీగూప కములున్న, నెగోషియెబుల్ ఎక్సేంజిబిల్లులు, ప్రాంసరీ నోట్లున్న, మరణకాలమునకు అవి ఉండుచోటనే ఉన్నట్లెంచబడును.

(సి) ఈ నిబంధనలలో ప్రత్యేకము ఏర్పాటుచేసిన బాకీలుగాక, హామీతో కూడియున్న లేక, కూడియుండని బాకీలు మరణకాలమునకు బాకీ ఇవ్వవలసినవారు నివసించుచుండు చోట నున్నట్లెంచబడును. కాని అందలి పట్టీమీద ఇన్కంటాక్సు ఆక్టుక్రింద ఇన్కంటాక్సు విధింపదగినదైనయెడల, అట్టి బాకీ హిందూ దేశములో నున్నట్లెంచబడును.

(డి) బ్యాంకు ఎక్కవుంట్లు ఏ బ్యాంకులో ఉంచబడెనో అక్కడ నున్నట్లెంచబడును.

(ఇ) ఏ గవర్నమెంటు అయినను, మునిసిపాలిటీ లేక లోకల్ బోర్డు అయినను ఇష్యూచేసిన సెక్యూరిటీలు, బేరర్ ఫారములో నున్నయెడల మరణకాలమునకు అవి ఎక్కడ నున్నవో అక్కడనున్న, ఇన్‌స్క్రైబ్డు లేక రిజిష్టర్డు అయినయెడల

ఇన్‌స్క్రిప్షను లేక రిజిస్టరు అయినచోటనున్ను ఉన్నట్లెంచ బడును.

(ఎఫ్) ఒక కంపెనీలో నామినీల పేరనున్ను, స్క్రిప్పు సర్టిఫికెట్లు న్నను లేకపోయినను, కంపెనీ పేరనున్ను ఉన్న షేర్లు, స్టాకు, డిబెంచర్లు, లేక డిబెంచర్లస్టాకులున్ను, కంపెనీ ఇన్కార్పొరేటు అయిన చోటనున్న ట్లెంచబడును.

(జి) ఇన్స్యూరెన్సు లేక ఎస్యూరెన్సు పోలసీలక్రింద రావలసిన సొమ్ములు, పోలసీలలో ఎక్కడ చెల్లించుటకు షరతు ఉండునో అక్కడనున్ను, అట్టి షరతు లేనియెడల కంపెనీ హెడ్డాఫీసు ఉన్నచోటనున్ను ఉన్నట్లెంచ బడును.

(హెచ్) పార్ట్నరుషిప్పులోని షేర్లు పార్ట్నరుషిప్పు వ్యాపారము ముఖ్యముగ నెక్కడ జరుపబడుచున్నదో అక్కడ నున్న ట్లెంచబడును.

(ఐ) ఓడలు, విమానములు వాటి షేర్లున్ను అవి రిజిస్టరు చేయ బడినచోట నున్నట్లెంచబడును.

(జె) వర్తకము, వ్యాపారము లేక వృత్తి, వీటి గుడ్‌విల్ ఎసెట్లు అవి జరుగుచున్నచోట నున్నట్లెంచబడును.

(కె) పేటెంట్లు, డిజైన్లు, ట్రేడ్‌మార్కులున్ను అవి రిజిస్టరైన చోటనున్న ట్లెంచబడును.

(ఎల్) కాపీరైటు, ఓటింగుహక్కులు, వాటి సామగ్రి ఉపయోగించుటకు లైసెన్సులున్ను, ఆ రైట్లు చలాయించే చోట్ల నున్నట్లెంచబడును.

(ఎమ్) చనిపోయినవాని ఎస్టేటుకు లాభముకలుగు ఎక్సుడెలిక్టో దావా కారణములు, రైట్లున్ను అవి బయలుదేరినచోట్ల ఉన్నట్లెంచబడును.

**9.** స్థిరాస్తి ఉండు స్థలము :

డ్యూటీ నిమిత్తము మరణానంతరమున ప్యాసయే స్థిరాస్తి ఎసెట్లుండుచోటు యీ దిగువ క్లాజుల ప్రకారము నిర్ణయించబడును.

(ఎ) కనిపించు (Tangible) స్థిరాస్తులు హిందూదేశములో నున్నట్లెంచబడును.

(బి) స్థిరాస్తులపై నుండు రైట్లు, ఇంటరెస్టులు, లేక స్థిరాస్తుల వల్ల వచ్చే లాభములున్ను స్థిరాస్తులుగ పరిగణింపబడునవి న్నీ, స్థిరాస్తులు హిందూదేశములో నున్న యెడల అవికూడ హిందూదేశములోనే ఉన్నట్లెంచబడును.

## 4 వ భా గ ము

### బంధువులవద్ద ఏన్యూయిటీలు కొనుబడి.

### 27 వ సెక్షను.

10. (1) ఈ నిబంధనకు లోబడి ఎస్టేటుడ్యూటీ బాకీపడినయెడల, లేక, ఈ నిబంధన లేనిచో 27 వ సెక్షనుక్రింద బాకీ పడునెడలనున్ను, ఈ క్రింది నదుపాయములు గ్రాంటుచేయబడును.

(2) మరణానంతరము చనిపోయినవానిచే అన్యాక్రాంతము చేయబడిన ఆస్తిపై, ఈ నిబంధన ప్రమేయములేకుండా ఏ మొత్తముపై డ్యూటీ చెల్లించవలసియుండునో ఆ మొత్తము మొదట నిర్ణయించి, ఈ దిగువ 3 వ నిబంధనలోని లిమిటేషనులకు లోబడి, ఆ మొత్తములో నుండి ఈ దిగువ మినహాయింపులు చేయబడును.

(ఎ) చనిపోయినవానికి ఏన్యూయిటీ లేక ఇతర ఇంటరెస్టు ఇవ్వవలసివచ్చుట ప్రారంభించినది లగాయతు చనిపోవువరకు ఇచ్చిన వసూళ్ళ మొత్తము చనిపోయిన వానివద్దనుండి అన్యాక్రాంతమును బట్టి అన్యాక్రాంతము తేదీనుండి ఎంతమట్టుకు మరణకాలమువరకు వచ్చినరాబడి మొత్తమునుమించునో, ఆమించిన తేడా మొత్తమున్ను, మరియు

(బి) కంట్రోలరుయొక్క అభిప్రాయములో అన్ని సందర్భము లను బట్టిన్నీ న్యాయమని తోచునంత పై తేడా మొత్త ము మీాద, ఎస్టేటు డ్యూటీపై ఎప్పుడైనను ఆ కాలము లో చెల్లించవలసిన వడ్డీరేటున కారువడ్డీయున్నూ,

'చనిపోయినవాని వద్దనుండి అన్యాక్రాంతమును బట్టి రాబడి మొత్తము' అనగా,

(i) మరణించినవాడు కలుగచేసిన ఋణము బాధ్యత కలిగి యుండనంతటి అన్యాక్రాంతపు ఆస్తి సందర్భములో ఆ ఆస్తినుండి అన్ని సందర్భములను బట్టిన్నీ, కంట్రో లరు ఉద్దేశములో న్యాయమై యుండునంతరాబడికి సమానమైన మొత్తమున్నూ,

(ii) మరణించినవాడు కలుగజేసిన ఋణము, బాధ్యతకలిగి యుండునంతటి అన్యాక్రాంతపు ఆస్తి సందర్భములో ఆ ఋణము, లేక బాధ్యతమీాద చనిపోయినవాడు చెల్లించిన లేక చెల్లించవలసిన వడ్డీల మొత్తమున్నూ, అగును.

(3) ఈ నిబంధనలోని 2 వ ఉపనిబంధన క్రింద మినహాయింపు యివ్వవలసిన మొత్తము ఈ దిగువ చెప్పిన సందర్భములలో ఈ ఉపనిబంధనలో చెప్పినంతమట్టుకు మాత్రం ఉండును. ఇంతేకాక, ఆ మినహాయింపు మొత్తము నిర్ణయించుటలో ఈ ఉపనిబంధనలో చెప్పిన విధముగా 46 వ సెక్షను 1 వ సబ్ సెక్షను అమలుకు వచ్చును.

(ఎ) (i) చనిపోయినవాడు కలుగచేసిన ఋణమునకు ఏన్యు యిటీ పేమెంట్లు ప్రతిఫలమైనయెడల, ఆ పేమెంట్ల మొత్తముకు సమానమైన మొత్తము. మరియు,

(ii) (డ్యూటీ చెల్లించవలసిన మొత్తము నిర్ణయించుటలో యివ్వవలసిన మినహాయింపును గురించి చెప్పిన) 44వ సెక్షను ఆ ఋణమునకు వర్తింపచేయునెడల, 46 వ

సెక్షను 1 వ సబ్ సెక్షను వర్తించు కారణముచేత, ఆ ఋణము అంతేయు 44 వ సెక్షనుక్రింద మినహా యివ్వబడియుండనప్పుడు, మినహా యివ్వబడు మొత్తము తెలుసుకొనుటకు ఆ ఏన్యుయిటీ పేమెంట్ల మొత్తము 44 వ సెక్షనుక్రింద పై సందర్భములలో మినహా యివ్వబడునంత మొత్తమును మించకుండా ఉండునట్లు తగ్గించబడును.

అయితే ఈ నిబంధన నిమిత్తము 46 వ సెక్షను వర్తింపచేయుటలో అన్యాక్రాంతపు ఆస్తి చనిపోయిన వాని వద్దనుండి వచ్చిన ఆస్తిగా ఎంచబడదు.

(బి) ఎప్పుడైతే 27 వ సెక్షనుక్రింద అన్యాక్రాంతమునకు 27 వ సెక్షను 2 వ సబ్ సెక్షను వర్తించకనున్న, అన్యాక్రాంతమునకు మరియొక ప్రతిఫలం ఏమీ ఇచ్చియుండకనున్న ఆఏన్యుయిటీ లేక యితరఇంటరెస్టు విషయములో కొంత ప్రతిఫలమునకు మినహా యివ్వబడి యుండెడిదో, అప్పుడు ఎలవుచేయు మొత్తము ఆమినహా మొత్తమును మించరాదు.

(సి) ఆ యివ్వబడిన మినహాయింపు మొత్తము, చనిపోయిన వానిచే కలుగచేయిబడిన ఋణము లేక బాధ్యతగల ఆస్తి నుండి మినహాయింపు యివ్వబడినప్పుడు అది 27 వ సెక్షను లేనేలేనియెడల 44 వ సెక్షనుక్రింద ఇచ్చియుండెడి మినహాయింపు మొత్తమును మించరాదు.

(డి) ఈ నిబంధనలో 'ఏన్యుయిటీ పేమెంట్లు' అనగా 2 వ ఉప నిబంధన క్లాజు (ఎ) లో చెప్పిన పేమెంట్లు 'మినహా ఇవ్వబడిన మొత్తము' అనగా ఈ నిబంధనక్రింద మినహాయింపుగా ఇవ్వవలసిన మొత్తము అని అర్థము.

## 5 వ భా గ ము

కుటుంబములో ఉంచుకున్న జాతీయ, రసాయన శాస్త్రీయ, చారిత్రిక వస్తువులు, ఇతర డ్రాయింగులు, పెయింటింగులు వగైరా.

### 33 వ సెక్షను

1వ సబ్ సెక్షను (ఐ), (జె) క్లాజులు.

**11.** డ్యూటీలేకుండుటకు కండిషనులు :

(i) చనిపోయినవాని కుటుంబములో ఉంచుకొన్నట్టిన్నీ 33 వ సెక్షను 1 వ సబ్ సెక్షను (ఐ), (జె) క్లాజులలో చెప్పినట్టిన్నీ జాతీయ, రసాయనశాస్త్రీయ, చారిత్రిక ప్రాముఖ్యత గల వస్తువులున్ను, ఇతర డ్రాయింగులు, పెయింటింగులున్ను సందర్భములను బట్టి యుక్తమని బోర్డుకు తోచునట్టి వారు, ఆ వస్తువులను ఇంకొకరి మరణానంతరము వరకున్ను లేక అమ్మివేయు వరకున్ను ఈ క్రింది తబ్సీళ్ళతో పూచీకత్తు ఇచ్చినయెడల ఆ వస్తువులను డ్యూటీలేకుండా తప్పించవచ్చును.

(ఎ) ఆ వస్తువులు హిందూదేశములోనే ఉంచబడుననియు, బోర్డు వారు నియమించే పని నిమిత్తమున్ను, కాలమువరకున్ను వానిని వదలదనియు,

(బి) వాటిని జాగ్రత్తచేయుటకు తగినచర్యలు తీసికొందుననియు,

(సి) అవి జాగ్రత్త చేయుటకు తగినచర్యలు తీసుకున్నదీ లేనిదీ పరీక్షించుటకున్ను, నేషనల్ మ్యూజియం, నేషనల్ ఆర్టు గేలరీ, ఆర్కియాలజీ డిపార్టుమెంటు, నేషనల్ ఆర్కైవ్స్ల యొక్క ఆఫీసర్లుగాని, బోర్డు అధికార మిచ్చినవానినిగాని

పరిశోధన రిపోర్టుల నిమిత్తమున్న సక్రమముగ చూడ
నిచ్చెదననియు,

(డి) కేంద్రప్రభుత్వము ఇచ్చే డైరెక్షనలు ప్రకారం చేయబడు
ననియు పూచీకత్తు యివ్వవలెను.

(2) ఈ నిబంధన వర్తించెడి ఏ వస్తువైనను అమ్మినప్పుడు, ఈముం
దు చెప్పబోయెడి పద్ధతికి లోబడి, ఏ ఆఖరు మరణానంతరమున
అవి ప్యాసైనవో అట్టి ఎస్టేటుయొక్క అసలు కిమ్మతుకు విధించ
బడుచేటున ఎస్టేటుడ్యూటీ చెల్లించవలసివచ్చును. ఎవరివల్ల,
లేక ఎవరిలాభము నిమిత్తము ఆ వస్తువులు అమ్మబడినవో,
వారు ఆ డ్యూటీకి ఎక్కవుంటు చెప్పవలసినవా రగుదురు.
అందు నిమిత్తము అమ్మకమునుండి ఒక నెలలోపున ఒక అక్క
వుంటు యివ్వవలెను.

కాని, అ అమ్మకము గవర్నమెంటుకు గాని, విశ్వవిద్యాల
యమునకు గాని, లేక హిందూదేశములో పబ్లికుసంస్థకు గాని
అయినయెడల అట్టి డ్యూటీ చెల్లించనవసరము లేదు.

**12.** పూచీ అక్కరలేకపోవుట :

ఈ అక్టు 33 వ సెక్షను 1వ సబ్ సెక్షను (ఐ), (జె) క్లాజుల
క్రింద డ్యూటీనుండి తప్పించుమని చేయబడు క్లెయిములో, ఏదస్తా
వేజునైనను రహస్యమైన విషయములు కలిగియున్నట్లు బోర్డుకు
కనబరచినయెడల ఆ దస్తావేజులను పూర్తిగానైనను లేక 11 వ
నిబంధన 1 వ ఉపనినిబంధనలో వలె పరిశోధన నిమిత్తము
చూపుటకు ఇచ్చే పూచీమట్టుకైనను పూచీకత్తు అక్కరలేకుండా
చేయవచ్చును.

**13.** పూచీకత్తు ప్రకారం చేయుటకు తప్పినయెడల జరుగునది :

(1) 11 వ నిబంధన, 1 వ ఉపనిబంధనక్రింద ఇచ్చిన పూచీ
కత్తుపైన ఏ వస్తువైనను డ్యూటీనుండి తప్పించినప్పుడు,

పూచీ ఇవ్వబడిన కాలములో ఎప్పుడైనను, ఏ ముఖ్యవిష యములోనైనను పూచీకర్తప్రకారము నడుచుకోలేదని, బోర్డు తృప్తిపడినయెడలనున్ను అప్పటికి ఆ పూచీవస్తువుల కిమ్మతుపైన ఏ మరణానంతరము డ్యూటీనుండి మినహా యించబడెనో ఆ ఎస్టేటు అసలు కిమ్మతు ననుసరించి ఈవస్తు వులకు 33 వ సెక్షను 1 వ సబ్ సెక్షను (ఐ), (జె) క్లాజుల లోని మినహా లేనిసందర్భములో డ్యూటీ ఇవ్వవలసిన రేటున ఎస్టేటుడ్యూటీ ఇవ్వవలసి వచ్చును. డ్యూటీ ఇవ్వ వలసి వచ్చిన సమయమున ఆ వస్తువులు అమ్మినయెడల ఆ అమ్మకపు సొమ్ము పుచ్చుకొనుటకు హక్కు కలిగియుం డువా రట్టిడ్యూటీకి లెక్కవుంటు చెప్పవలసినవా రగుదురు.

(2) 1 వ ఉపనిబంధనక్రింద ఏ మరణానంతరము అయినను డ్యూటీ ఇవ్వవలసి వచ్చినతరువాత ఏ వస్తువులనైనను అమ్మినయెడల, ఆ అమ్మకపు సొమ్ముపైన ఆ మరణానంత రమే మరల డ్యూటీకి బాధ్యత ఉండదు.

## 6 వ భాగము.

## ఆస్తి మదింపు తణిఖీ.

(41 వ సెక్షను)

**14.** మదింపు :

(1) లెక్కవుంటు చెప్పవలసిన వ్యక్తి ఇచ్చిన లెక్కవుంటులో చూపిన మదింపు కంట్రోలరు అంగీకరించవచ్చును. లేక, ఆమదింపుతో తృప్తిచెందనియెడల, తన ఎస్టిమేటు ప్రకార ము తానే మదింపు వేయవచ్చును. లేక ఎవరినైనను ఆ ఆస్తులను చూచి, మదింపు కట్టమని, నియమించవచ్చును. అట్టి ప్రత్యేకవృత్తి సహాయమునకు అయే ఖర్చు గవర్న మెంటు ఇచ్చును.

(2) ఎవరికైనను ఒకరువిల్లు, వ్రాసి. అందులో ఒకఆస్తికిమ్మతు ఇంత అనిచెప్పి, అంతకొరక ఆస్తిని సంపాదించుకొనుటకు అప్పరు ఇచ్చుటవల్ల ఆట్టికిమ్మతు ఆ ఆస్తియొక్క ఒజారు కిమ్మతుగా లెఖ్ఖించబడదు.

(3) మరణము జరిగిన వెంటనే ఒకఆస్తి బహిరంగ బజారులో అమ్మబడి యున్నప్పుడు, అందుకైనఖర్చులు మినహాయించకుండా అమ్మకపు సొమ్ము అసలు కిమ్మతుగా తీసికొనబడును.

(4) ఒకఆస్తి ఎడ్మినిష్టరుకాని ఆస్తిలోని భాగమైనప్పుడున్ను అప్పటిక్రితమునుంచీ ట్రస్టులో ఉండి యున్నట్టిన్ని, అమ్మి సొమ్ముచేయవలసి ఉన్నట్టిన్ని, ఆస్తి అయినయెడలనున్ను, లేకజాతీయ లేక రసాయన శాస్త్రీయ ప్రాముఖ్యతగల వస్తువు అయియున్న యెడలనున్ను, అందలి కిమ్మతు నిర్ణయించుటలో, కంట్రోలరు అమ్మకపుఖర్చులలో న్యాయమైనంత మినహాయింపు ఇవ్వవచ్చును.

(5) ఖనిజములుగల భూమి ఆస్తిలోనున్నయెడల మైనింగు ఇంజనీయరు యొక్క సర్టిఫికెట్టు ఆధారముమీద ఆ ఖనిజములమీద ఒకవేరు కిమ్మతువేయవలెను.

(6) వ్యవసాయపు భూమి విషయములో అసలుకిమ్మతు ల్యాండురెవెన్యూ నిర్ణయించుటకు ఉండే సాంవత్సరిక కిమ్మతుకు 20 రెట్లును సామాన్యముగా మించరాదు.

(7) వచ్చునని తలచు ఇంటరెస్టుల బజారుకిమ్మతు తేల్చుటలో యీ క్రింది షరతులు గమనించబడును.

(a) జీవితకాలపు హక్కుదారుయొక్క వయస్సు, ఆరోగ్యస్థితి, వాని ఇంటరెస్టు కాలమున్ను పరిమితమున్ను, ఇన్స్యూరెన్సు చేయుటకు అయే ఖర్చున్ను,

(బి) ఆ ఇంటరెస్టులు స్వాధీనముతో కూడినవైనప్పుడు డ్యూటీయున్నూ, రాబట్టుటకున్నూ పంచి యిచ్చుటకున్నూ అయే ఖర్చులున్నూ,

(సి) ఎస్టేట్లరకము, వాటికి కలుగుటకవకాశము ఉన్న పెరుగు తరుగులున్నూ,

(డి) వడ్డీరేటున్నూ, అఫిషల్‌గా అంగీకరింపబడు మోర్టాలిటో టేబుల్సున్నూ.

(8) విదేశములోనున్న డ్యూటీ విధింప తగిన ఆస్తికిమృత్యు, మరణకాలమునకు ఉన్న మారకపు రేటు ప్రకారము లెఖ్ఖ కట్టవలెను.

**15.** తణిఖీ.

(1) ఈ ఆక్టునిమిత్తము ఏ ఆస్తిలోనైనను ప్రవేశించుటకున్నూ పరీక్షించుటకున్నూ, కంట్రోలరు వ్రాతమూలమైన ఉత్తరువునల్ల ఎవరికైనను అధికారమివ్వవచ్చును.

(2) ఆస్తి స్వాధీనము కలిగియున్నవారు అట్లు అధికారము ఇవ్వబడిన వ్యక్తిని, ఆదివారములున్నూ, నెగోషియెబుల్ ఇన్‌స్ట్రమెంట్సు ఆక్టు 1881 క్రింద శలవుదినములున్నూ గాక, మిగతారోజులలో ఉదయం 6గంటలు లగాయతు సాయం కాలము 6గంటలలోపున ఏసమయములోనైనను ప్రవేశించుటకున్నూ, పరీక్షించుటకున్నూ పెర్మిటు చేయవలెను.

## 7 వ భాగము.

### అననుకూల దేశములో చెల్లించిన డ్యూటీకి మినహాయింపు.

(49 వ సెక్షను)

**16.** మినహా పరిమితి: హిందూదేశములో ఈఆక్టుక్రింద డ్యూటీ విధింపదగియున్న ఏ ఆస్తినైనను రెండుదఖాలను ఒకేఆస్తికి ఎస్టేటు డ్యూటీ విధింపు జరుగకుండా ఉండుటకు, లేక సదుపాయ

ము చేయుటకు ఒడంబడిక చేసికొని యుండని ఇతర దేశము లో ఎస్టేటు డ్యూటీ విధించిన యెడల, ఆస్తి కిమ్మతులో నుంచి 49 వ సెక్షను క్రింద కంట్రోలరు మినహాయింపుగా ఇవ్వవలసిన మొత్తము ఈదిగువ ప్రకారముండును.

(ఎ) అన్యదేశములో డ్యూటీవిధించుటకు బీజాధారము (సిటస్) హిందూదేశములో డ్యూటీ విధించుటకు బీజాధారము వంటిదే అయిన యెడల, అన్యదేశములో చెల్లించిన డ్యూటీ మొత్తము.

(బి) మిగతా కేసులలో బోర్డు డైరెక్టరు చేయునంత మొత్తము.

## 8 వ భాగము

## డ్యూటీ చెల్లింపు.

(51 వ సెక్షను,)

**17.** డ్యూటీ లెక్కకట్టుట :

53 వ సెక్షనుక్రింద లేక 57 వ సెక్షను క్లాజు (ఎ) క్రింద, ఇవ్వబడిన ఎక్కౌంటులో తెలుపబడిన, లేక 61 వ సెక్షను 2 వ సబ్ సెక్షనుక్రింద తయారుచేయబడిన అసలు కిమ్మతు (మగింపు) మీాద సరియైన రేటున డ్యూటీముందర లెక్క కట్ట వలెను. కాని ఆ తరువాత ఏ కారణము చేతనైనను డ్యూటీ తక్కువ కట్టినట్లు కనిపెట్టబడినయెడల అదనపుడ్యూటీ చెల్లించ వలెను. 62 వ సెక్షను 2 వ సబ్ సెక్షనులో చెప్పిన కండిషను లకు లోబడి, బకాయి డ్యూటీగా ఎంచబడును.

**18.** చెల్లించు విధము :

(1) డ్యూటీ చెల్లింపులున్ను, డిపోజిట్లున్ను ఈ క్రింది విధముగ చేయవచ్చును.

(ఎ) కంట్రోలరు ఆఫీసులో పెయ్యాల్డు బ్యాంకుపై చెక్కు ఇచ్చుట మూలముగను,

(బి) కంట్రోలరు ఆఫీసులో పెయ్యాల్డు బ్యాంకు ఇచ్చినడ్రాఫ్టు ఇచ్చుట మూలముగను,

(సి) ఏగవర్నమెంటు ట్రెజరీ లేక సబ్ ట్రెజరీలోనైనను సెంట్రల్ గవర్నమెంటు ఎక్కవుంటుకుగాని, ఇండియా రిజర్వుబ్యాంకు ఏ బ్రాంచిలో గాని, లేక ఇంపీరియల్ బ్యాంకుయొక్క ఏ బ్రాంచిలో గాని, లేక గవర్నమెంటు ట్రెజరీ వ్యాపారము చేయుచున్న పై వాటి ఏజన్సీలలో గాని, లేక సెంట్రల్ గవర్నమెంటు అధికారమిచ్చు ఏ ఇతర బ్యాంకులలో గాని డిపోజిట్టు చేయుట మూలముగను,

(డి) క్లాజు (సి) ప్రకారము డిపోజిట్టు చేయునపుడు అందుతో ఒక చలాను జత పరచవలెను. అందలి రశీదు భాగము చెల్లించినవాని కివ్వబడును.

(2) చెక్కులున్ను బ్యాంకు డ్రాఫ్టులున్ను ఇండియా రిజర్వుబ్యాంకు పేర క్రాసుచేసి ఇవ్వవలెను.

(3) చెక్కు ఏదైనను కంట్రోలరుకు ఇచ్చునపుడు, కంట్రోలరు రశీదు ఇచ్చినప్పటికిన్ని చెక్కుసొమ్ము వసూలయ్యేవరకు డ్యూటీ చెల్లించి నట్లెంచబడదు.

(4) కంట్రోలరు అధికారమిచ్చినవారు మాత్రమే డ్యూటీ చెల్లించుటకు రశీదులు యివ్వవలెను.

**19.** అక్కవుంటుకు డ్యూటీ చెల్లింపు లేక డిపోజిట్టు :

18 వ నిబంధనలో చెప్పిన విధముగా డ్యూటీ అక్కవుంటునకు చెల్లించునప్పుడు, చెక్కు లేక డ్రాఫ్టుతో చనిపోయినవాని పేర, మరణ తేదీ (తెలిసినయెడల) ఎస్టేటు అఫిషల్ నెంబరు ఇచ్చుచు ఒక ఉత్తరము కూడా జతపరచవలెను. సెంట్రల్ గవర్నమెంటు కాతాకు డిపోజిట్టు చేసినప్పుడు కూడా అట్టి ఉత్తరం పంపవలెను.

## 9 వ భా గ ము

## అక్కౌంటు తయారు వప్పగింత

(53, 57, 61, 72 సెక్షనులు.)

**20.** ఎక్కౌంటు ఫారము.

(1) 53 వ సెక్షను 3 వ సబ్ సెక్షను క్రింద వప్పగించవలసిన అక్కౌంటు ఈ నిబంధనలకు జతపరచిన ED, నమూనాలో నుండవలెను. 53 వ సెక్షను 3 వ సబ్ సెక్షను క్రింద చెప్పిన సప్లిమెంటరీ అక్కౌంటు కూడా అందలి అయిటములకు కావలసిన సవరింపులతో ఈ ఫారములలోనే ఉండవలెను.

(2) 57 వ సెక్షను క్లాజు (ఎ) లో చెప్పిన మదింపు అఫిడవిట్టుకు జతపరచవలసిన అక్కౌంటు కూడా ED, నమూనాలోనే ఉండవలెను.

(3) 61వ సెక్షను 2 వ సబ్ సెక్షనులో చెప్పిన అక్కౌంటు ED ఫారంలో నుండవలెను.

(4) అట్టి అన్ని ఎక్కౌంట్లును్ను ఎస్టేటులో చేరియున్న ప్రతీ అయిటముయొక్క అసలు కిమ్మతున్ను, మదింపుకు ఆధారమున్ను, పూర్తి వివరములున్ను చూపవలెను. అక్కౌంటు చెప్పవలసిన వ్యక్తి అట్టి మదింపు తానే స్వయముగ ఎస్టిమేటు చేయవచ్చును. లేదా, వృత్తిసహాయమున ఎస్టిమేటు చేసినయెడల అర్హత గల వేల్యూయరు సర్టిఫికెట్టు జతపరచవలెను.

(5) నిర్ణయించబడిన నమూనాకు దరిదాపుగా ముఖ్య విషయములు గల ఇతర నమూనాలలో కూడ అక్కౌంటు కంట్రోలరు అంగీకరించవచ్చును.

(6) రిప్రిజెంటేషను గ్రాంటు అక్కరలేక, ఎస్టేటు చిన్నదనే కారణమున డ్యూటీనుండి మినహాయింపు క్లెయిం చేయునప్పుడు ED

ఫారంలో అక్కౌంటు ఇవ్వవచ్చును.

**21. బెనిఫిషియరీ ఎక్కౌంటు చెప్పవలెను :**

చనిపోయినవాని డ్యూటీకి బాధ్యతగల ఎస్టేటు పంచి ఇవ్వ బడినయెడల, ఆ స్తిపుచ్చుకున్న ప్రతీ వ్యక్తిన్నీ చనిపోయిన వాని వద్దనుండి తాను పుచ్చుకున్న అన్ని ఆస్తులకు పూర్తి తబ్సీళ్ళు ఇవ్వవలెను.

**22. ఎక్కౌంటుతో విల్లు నకలు యివ్వవలెను :**

ఎక్కౌంటు యివ్వవలసిన వ్యక్తి 20 వ నిబంధన 1 వ లేక 2 వ ఉపనిబంధన ప్రకారము వప్పగించవలసిన అసలు ఎక్కౌంటుతో బాటు, విల్లు ఉన్నయెడల చనిపోయినవాని విల్లు నకలు ఒకటిన్నీ దాని కోడిసిల్ నకలున్ను జతపరచ వలెను.

**23. అక్కౌండు డూప్లికేటులో నుండవలెను :**

ఏ నిబంధన ప్రకారమైనను ఇవ్వవలసిన ఎక్కౌంటు డూప్లి కేటులో నుండవలెను.

**24. అక్కౌంటు బుక్కులు, దస్తావేజులు :**

చనిపోయినవాని ఎస్టేటుపై జూరిస్డిక్షను గల కంట్రోలరు ఆఫీసులో అక్కౌంటు చెప్పవలసినవారు కంట్రోలరు నోటీసు లో, కావలెనని వివరించినట్టిన్నీ, దాఖలుచేసిన అక్కౌంటుకు సంబంధించినట్టిన్నీ, అక్కౌంటు బుక్కునైనను, డ్యూటీ విధిం చు నిమిత్తము ఏ దస్తావేజునైనను, హాజరు పరచవలెను.

**25. ఎప్పుడు ఎక్కౌంటు సరిగా యివ్వబడిన ట్లెంచబడును :**

ఎప్పుడు కంట్రోలరుకు సక్రమముగా ఎక్కౌంటు వప్ప గించిన ట్లెంచబడుననగా,

(ఏ) నిర్ణయించబడిన ఫారము అక్కౌంటు ఇవ్వవలసినవారు సంతకము చేసి, ఆక్టు ప్రకారమున్ను నిబంధనల ప్రకారమున్ను, కంట్రోలరు కావలెనన్నవిన్ని, ఈ ఫారములో నున్న విన్ని, విషయములకు పూర్తియైన స్టేటుమెంటు ఇచ్చినప్పుడున్ను, మరియు,

(బి) ఆక్టున్ను నిబంధనలున్ను, కంట్రోలరున్ను ఈ అక్కౌంటుతో బాటు కావలెనని చెప్పిన అన్ని దస్తావేజులున్ను, నకళ్ళున్ను, కంట్రోలరు గాని, కంట్రోలరు అధికారమిచ్చిన ఇతర ఆఫీసరుగాని పుచ్చుకొన్నప్పుడున్ను,

## 10 వ భాగము. మెసిలేనియస్.

### జనరలుగా—ఫారములు

(72 సెక్షను)

**26.** ఫారములు :

(1) 67 వ సెక్షను 5 వ సబ్ సెక్షనుక్రింద సర్టిఫికెట్టు నిమిత్తము ధరఖాస్తు $FD_2$ ఫారంలో నుండవలెను.

(2) 60 వ సెక్షనుక్రింద సర్టిఫికెట్టు $ED_3$ ఫారంలో నుండవలెను.

(3) 67 వ సెక్షను 1,2,3 సబ్ సెక్షనుల క్రిందనున్ను 68,69 సెక్షనుల క్రిందనున్ను సర్టిఫికెట్టు $ED_4$ ఫారంలో నుండవలెను.

(4) డ్యూటీ లేనప్పుడు డిశ్చార్జి సర్టిఫికెట్టు $ED_6$ ఫారములో నుండవలెను.

### డ్యూటీ వసూలు.

(73 వ సెక్షను)

**27.** సర్టిఫికెటు క్రిందిడ్యూటీ వసూలు చేయవలెను :

1. 73 వ సెక్షను క్రిందిడ్యూటీ వసూలు చేయుటకు కంట్రోలరు వ్రాతమూలములో ఈ క్రింది విధముగ ఒక సర్టిఫికెట్టు ఇవ్వవలెను.

(ఎ) సర్టిఫికెట్టులో పేర్కొనబడిన వ్యక్తి ఆక్టుక్రింద డ్యూటీ చెల్లించవలసిన ఎగ్జిక్యూటరు, లేక వ్యక్తి అనిన్నీ,

(బి) సర్టిఫికెట్టులో చెప్పిన డ్యూటీ మొత్తములో సర్టిఫికెట్టులో చెప్పిన ఆస్తికి చెల్లించవలసిన డ్యూటీచేరియున్నదనియు,

(సి) సర్టిఫికెట్టులో చెప్పిన వ్యక్తికి చెల్లించవలసిన డ్యూటీకి నోటీసు యివ్వబడినదనియు,

(డి) సర్టిఫికెట్టులో చెప్పిన మొత్తము సర్టిఫికెట్టు నాటికి సెంట్రల్ గవర్నమెంటుకు డ్యూటీక్రింద యివ్వవలసియున్నదనియు,

2 ఈ నిబంధనలో 'డ్యూటీ' అనే పదములో ఆక్టుక్రింద చెల్లించవలసిన వడ్డీ లేక పినాల్టీకూడ చేరియుండును.

కంపెనీలో చనిపోయిన మెంబరును గురించి కంపెనీ యివ్వవలసిన వివరములు :

(84 వ సెక్షను).

**28.** విదేశకంపెనీ యివ్వవలసిన వివరములు :

ఈ ఆక్టు 84 వ సెక్షను నిమిత్తము ఆ సెక్షను వర్తించెడి కంపెనీ, ఈ దిగువ వివరములతో ఒక స్టేటుమెంటు కంట్రోలరుకు ఇవ్వవలెను.

1. చనిపోయిన మెంబరు పేరు.
2. ఆఖరున తెలిసిన చిరునామా.
3. చనిపోయిన తేదీ.
4. లాడ్జిమెంటు, లేక ప్రొబేటు ఎడ్మినిస్ట్రేషను ఉత్తరములు లేక మరణము సంగతి తెలిసిన తేదీ.
5. మరణమునాటికి మరణించిన మెంబరుకు కంపెనీలో నున్న షేర్లు స్టాకుల వర్ణన.

6. షేర్లు, స్టాకుల నెంబర్లు, వాటి సర్టిఫికెట్టుల నెంబర్లు.
7. షేర్లు, స్టాకుల నామినలు కిమ్మతు.
8. మరణకాలమునకు షేర్లు, లేక స్టాకుల బజారు కిమ్మతు.
9. మదింపుకు మూలాధారం (బేసిస్సు)
10. హోల్డింగు మొత్తం కిమ్మతు.
11. ట్రిస్టీలు, ఎడ్మినిస్ట్రేటర్లు లేక యితరలీగల్ రిప్రెజెంటేటీవుల పేర్లు, చిరునామాలు.

**29.** ఇన్డియన్ కంపెనీ యివ్వవలసిన వివరములు :

1913 వ సంవత్సరపు ఇన్డియన్ కంపెనీల ఆక్టుక్రింద ఏర్పడి రిజిస్టరైన ఒక కంపెనీ, అందలి ముఖ్యోద్యోగి ద్వారా, ఒక మెంబరు చనిపోయినట్లు తెలిసికొన్నయెడల అది తెలిసిన తేదీ లగాయతు ఒక నెల లోపున ఆ కంపెనీకి ఇన్కంటాక్సు ఆఫీసరుగా పనిచేయుచున్న అసిస్టెంటు కంట్రోలరుకు, లేక డెప్యూటీ కంట్రోలరుకు ఈ దిగువ వివరములు ఇవ్వవలెను.

A చనిపోయిన వానిపేర నిలచియున్న అన్నీ లేక కొన్ని షేర్లు. స్టాకుల ట్రాన్సుఫరు ట్రాన్సుఫరు పొందినవారు కిమ్మతైన ప్రతిఫలము ఇచ్చి వాటిని సంపాదించినట్లు తృప్తిపొందిన కారణమున, రిజస్టరు చేసినప్పుడు,

(i) షేర్లు కలిగియుండి చనిపోయిన మెంబరు పేరు, ఎడ్రసు.
(ii) ట్రాన్సుఫరు పొందినవాని పేరు, ఎడ్రెసు.
(iii) ట్రాన్సుఫరుచేసిన షేర్లు, నెంబర్లతోసహా, వర్ణన.
(iv) ట్రాన్సుఫరుచేసిన షేర్ల నామినల్ కిమ్మతు.
(v) ట్రాన్సుఫరుపొందిన వారిచ్చిన ప్రతిఫలము.
(vi) ప్రతిఫలం ఎవరికి ఇవ్వబడెనో అట్టి ట్రాన్సుఫరు చేసినవాని పేరు, ఎడ్రెసు; లేక ఏ బ్రోకరుద్వారా ప్రతిఫలం ఇవ్వబడెనో వాని పేరు, ఎడ్రెసు.

(vii) వివరములు ఇచ్చునాటికి ఇంకనూ చనిపోయిన మెంబరు పేరనున్న షేర్ల వర్ణన.

B వివరములు ఇచ్చునాటికి షేర్ల ట్రాన్సుఫరు రిజిస్టరుచేసి యుండనిచో

(i) చనిపోయిన మెంబరుపేరు, ఎడ్రెసు.

(ii) చనిపోయినవానిపేర ఉండియున్న, షేర్ల, ప్రత్యేక నెంబర్లతో సహా వర్ణన.

(iii) ఉన్నస్టాకుల, షేర్ల నామినల్ కిమ్మతు.

(iv) చనిపోయినవాడు చనిపోయిననాటికి, ఎస్టిమేటు చేయబడిన బజారుకిమ్మతు.

(v) చనిపోయినవాని ట్రస్టీ, ఎడ్మినిస్ట్రేటరు లేక ఇతరలీగల్ రిప్రెజెంటేటీవుల పేర్లు, ఎడ్రెసులు.

(vi) ఎవరివల్లనైనను షేర్లు, ట్రాన్సుఫరుచేయుమని ధరఖాస్తు పెట్టిన పైనం,

(vii) అట్టి ధరఖాస్తు పెట్టినయెడల పెట్టినవాని పేరు, ఎడ్రసు.

---

ఎస్టేటుడ్యూటీ (కంట్రోల్డు కంపెనీల) నిబంధనలు.

13-2-54 వ తేదీని ఇండియా గెజెట్టులో 2 వ భాగంలో 3 వ సెక్షనులో 339 వ పేజీలో యస్. ఆర్.

ఒ. నెం. 491 రున ప్రచురింపబడినవి.

**1.** క్లుప్తనామము : ప్రారంభము :

1. ఈ నిబంధనలు ఎస్టేటుడ్యూటీ (కంట్రోల్డు కంపెనీల) నిబంధనలు అనబడవచ్చును.

2. అవి 15-10-1953 వ తేదీని అమలులోనికి వచ్చినట్లెంచబడును.

**2.** నిర్వచనములు :

సందర్భమును బట్టి మరియొకలాగున చెప్పవలసి వచ్చునెడల తప్ప, ఈ నిబంధనలో—

1. 'ఏక్టు' అనగా ఎస్టేటుడ్యూటీ ఏక్టు 1953 వ 24 వ ఆక్టు).
2. 'ఎసెట్లు'లో మంచిపేరు (గుడ్‌విల్) కూడ ఉండును.
3. 'ఎస్పోసిఫియేటెడ్ ఆపరేషనులు' 27 వ సెక్షను 7 వ సబ్ సెక్షను 4 వ క్లాజులోని అర్థమే కలిగియుండును.
4. 'సగటు రేటు (ఏవరేజి రేటు)' అనగా, ఒక కంపెనీ విషయములో సంవత్సరమునకు 100 కి రేటు; పెర్సెంటేజి ఈ దిగువ విధముగా నిర్ణయించబడును.
   (ఎ) మనకు కావలసిన (రిలవెంటు) అక్కవుంటింగు సంవత్సరములలో, ఏ సంవత్సరమైనను నష్టము వచ్చినయెడల, ఆనష్టము తీసివేసి, నికరరాబడి మొత్తము లెఖ్ఖకట్టి,
   (బి) ఆ మొత్తమును సంవత్సరముల నెంబరుచే భాగించి,
   (సి) భాగించగా వచ్చిన రిజల్టును, చనిపోయినవాని మరణానంతరము 17 వ సెక్షను ప్రకారము ప్యాసయే కంపెనీలోని ఎసెట్లు అసలు కిమ్మతులో నుంచి, 10 వ నిబంధనలోని మినహా మొత్తము తీసివేయగా వచ్చే (బేలన్సు) మొత్తముతో సరిపోల్చ (కంపేరుచేయ) వలెను.
5. కంపెనీకి సంబంధించిన 'డిబెంచరు' అనగా, కంపెనీకి మామూలు బ్యాంకింగు వ్యాపారములో ఇవ్వబడిన అప్పునకు ప్రతిఫలముగా కంపెనీకి ఉండు బాధ్యతగాక, కంపెనీ ఇస్యూచేసిన ఏ ఇతర బదులు మూల ధనము (లోన్ కేపిటల్) విషయములోనైనను, లేక,
   (ఎ) మామూలు బ్యాంకింగు వ్యాపారములో తెంపరరీగా కంపెనీ పుచ్చుకున్నది గాక, కంపెనీ బదులుపుచ్చుకున్న ఇతరసొమ్ముకొరకున్ను;
   (బి) మామూలుగా తానుచేయు వ్యాపార షరతులమీద కంపెనీకి ఒకరు ఎసెట్లు ట్రాన్స్ఫరు చేయుటవల్ల కలిగే బాధ్యత అయితే తప్ప, ఎవరిచేనైనను కంపెనీకి మూల ధనం ఎసెట్ల ట్రాన్సఫరు కొరకున్ను,

(సి) ప్రతిఫలం లేకుండా గాని, కంపెనీ అప్పు పుచ్చుకున్నప్పటి కన్న దర్శిలా ఏ ఒకప్పటికైనను (ఆ అప్పుపై ప్రీమియం కలుపుకుని) కంపెనీకి తక్కువ కిమ్మతుచేయునట్టి ప్రతి ఫలమునకు గాని,

(డి) మామూలు వ్యాపారములో ప్రత్యేక అరేంజిమెంటు లేనిచో వడ్డీ ఉండునట్టి స్వభావముగల బాకీ అయివుండి అట్టి వడ్డీలేకుండగనున్న లేక అసబబుగా హెచ్చైన, లేక తక్కువ అయిన వడ్డీకి చేయబడిన అప్పు అయినప్పుడున్ను, కంపెనీకి ఉండెడి యితర విధమైన బాధ్యతయే కంపెనీ డిబెంచరు అగును.

6. 'డిస్పొజిషన్ (అన్యాక్రాంతము)' లో ఒకే ఆపరేషన్ వల్లనైనను, లేక ఎస్సోసియేటెడ్ ఆపరేషనుల వల్లనైనను చేయబడిన ట్రిస్టు, కవనెంటు, ఎగ్రిమెంటు లేక అరేంజిమెంటున్ను కంపెనీ షేర్లు, డిబెంచర్లు విషయములో ఒకే ఆపరేషనువల్లగాని లేక, ఎస్సోసియేటెడ్ ఆపరేషనులవల్ల గాని, షేర్లు డిబెంచర్లకు సంబంధించిన రైట్లు నశింపు లేక మార్పులుకూడి యుండును.

7. 'పంచిన ఎసెట్లు' అనగా 17 వ సెక్షను 3 వ సబ్ సెక్షను వర్తించునట్టిన్ని ఆ సబ్ సెక్షను క్రింద పంచిపెట్టబడిన లేక అన్యాక్రాంతము చేయబడిన ఎసెట్లు: మరియు, 'పంపకపు కిమ్మతు' అనగా, పంచిన ఎసెట్ల విషయములో వాటి కిమ్మతు, లేక పంపకమునకు కొంత మట్టుకు మాత్రమే రొఖ్ఖముగాని దానికి సమానమైనది గాని ప్రతిఫలము ఇవ్వబడి, కంపెనీయొక్క స్వలాభ ఉపయోగముల నిమిత్తము పుచ్చుకోబడినయెడల, వాటి కిమ్మతులో ఇచ్చిన ప్రతిఫలము కిమ్మతుపోను మిగతా మొత్తము అగును.

8. 'డివిడెండు'లో 1922 వ సంవత్సరపు (XI ఆఫ్ 1922) ఇన్డియన్ ఇన్కంటాక్సు) ఆక్టు నిమిత్తం డివిడెండుగా నెంచబడు

ఏ మొత్తమైనను చేరును.

9. 'మెంబరు' అనగా, కంపెనీలోని షేర్లను, డిబెంచర్లను తన స్వంతహక్కుతో కలిసియున్నవాడున్ను, స్వంతహక్కు లేకపోయినను అట్టిషేర్లు డిబెంచర్లలో ఇంటరెస్టు కలిగియున్నవాడున్ను చేరియుందురు.

10. 'పేమెంటు'లో ఆస్తి ట్రాన్సఫరున్ను, సెటాఫ్ లేక బాధ్యత విడుదలయున్ను చేరియుండును. ఆస్తి ట్రాన్సఫరు, బాధ్యత, సెటాఫ్, లేక విడుదలను సంబంధించిన పేమెంటు మొత్తము అని చెప్పినచోట్ల, వాటి కిమ్మతులు కూడ కూడియుండును.

11. 'పవరు'లో కంపెనీలోని షేర్లు, డిబెంచర్లు కలిగియుండుటను బట్టి చలాయించగలరైటున్ను, పవరున్ను, మరియు షేర్లు డిబెంచర్లు కంపెనీ ఇస్యూచేయునట్లు చేయుటకు ఉండే, రైటు లేక పవరున్ను చేరియుండును.

**3.** అర్థములు :

1. ఈ నిబంధనల నిమిత్తము—

ఈ క్రింద కండికలలో ఏ వయినను తృప్తి పడినయెడల, ఒక వ్యక్తి పేమెంటు రాబడి అనుభవము, ఎసెట్లు లేక ఇంటరెస్టును కలిగియున్నట్లు లేక పుచ్చుకున్నట్లు ఎంచబడును.

(ఎ) ఏ విధముగనైనను ఆ వ్యక్తియొక్క లాభము నిమిత్తము అట్టి పేమెంటు వగైరాలను వినియోగించినను, లేక ఎప్పుడైనను వినియోగపడునట్లు చేసినను లేక అట్లు వినియోగపడుట కవకాశము ఉన్న ఏ ఆస్తి అయినను, ఒక ఆపరేషను లేక వరుసగా నుండు ఎక్కువ ఆపరేషనులవల్ల అట్లు వినియోగము చేయబడినను,

(బి) అట్టి పేమెంటు వగైరాలలో నుండి ఏ విధమైన ఉపకారములనైనను ఆ వ్యక్తి పుచ్చుకున్నను పుచ్చుకోగలందులకు ఏర్పరచినను,

(సి) నమ్మకముతో కూడిన (ఫిడ్యూష్యియరీ) తాహతులో తప్ప ఆ వ్యక్తి ఏ విధముగనైనను ఆ పేమెంటు వగైరాలకు లేక ఏ ఆస్తికైనను వినియోగపరచుటలో కంట్రోలు కలిగి యున్న యెడలను,

(డి) అట్టి పేమెంటు వగైరాలుగాని, ఏ ఆస్తిగాని ఆ వ్యక్తి యొక్క ఆస్తి కిమ్మతును వృద్ధిచేయునట్లు వినియోగించబడి నను,

(ఇ) 3 వ నిబంధన 1 వ ఉపనిబంధనలో చెప్పబడిన రాబడి విషయమై, కంపెనీ అట్టి రాబడి పుచ్చుకొనుట' లేక చెం దుటచేత అట్టి వ్యక్తికి లాభకరమైన ఇంటరెస్టు ఉండియున్న ఏ ఆస్తియొక్క అయినను కిమ్మతు ఆ వ్యక్తికి వృద్ధియగు నట్లున్ను, అప్పుడు ఆ వ్యక్తి యీ పేరావల్ల పొందినట్లెంచ బడు రాబడి అట్టి ఆస్తి కిమ్మతు వృద్ధికి సరిపడునట్లున్ను చేసినను,

మరియు ఈ నిబంధనలలో చనిపోయిన వ్యక్తి అట్టి పేమెంటు వగైరాలు పుచ్చుకున్నట్లు, పొందినట్లు అనుభ వించినట్లు చెప్పబడినచోట్ల ఇట్టి అర్థము నే తీసుకొనబడును.

2. ఈ నిబంధనలో ఎవరివల్లనైనను అన్యాక్రాంతము చేయబడి నట్లు గాని, ఎవరిచేనైనను పవరు చలాయించబడినట్లు గాని, చలాయించబడగలదని గాని, లేక ఎవరిచేనైనను ఇతర పనులు చేయబడినట్లు గాని, చెప్పబడుటలో ఆ వ్యక్తినీన్ని, ఇంకొకరు న్ను కలసి, జాయింటుగానైనను లేక ఆ వ్యక్తి తరపున ఇం కొకరు గాని, లేదా ఇంకొక వ్యక్తి అంగీకారముతో లేక అంగీ కారము లేకుండగాను, 15 వ నిబంధన 3 వ ఉపనిబంధనలో చెప్పిన అర్థముతో తాను కంట్రోలు కలిగియున్న కంపెనీగాని చేసినపనులు కూడ, కూడియుండును. అట్టి పని విషయములో ఒకరు పనిని చేయకుండుట అని వచ్చినచోట్ల కూడా అదే విధ

ముగా అర్థము చేసుకోవలెను. ఇంకొకరి అనుమతిని అట్టి పనులు చేయబడుచున్నట్లు చెప్పుచోట్ల, వాని కోరికపైన చేయబడి తాను అంగీకరించినట్లున్ను అర్థము చేసుకొనవలెను.

3. ఈ నిబంధనలో ఒకరు నమ్మకముతో కూడిన ఫిడ్యూషియరీ తాహతులో పవరు, లేక కంట్రోలు కలిగియున్నట్లు చెప్పినప్పుడు తాను చేసిన అన్యాక్రాంతము వల్లగాక యితరత్రా ఆ తాహతులో మాత్రమే పవరు కలిగియుండినట్లు చెప్పుట అని అర్థము.

**4.** అన్యాక్రాంతములు, లేక అపరేషనులు ట్రాన్స్ఫర్లుగా ఎంచుట :

కంపెనీపేర అన్యాక్రాంతము చేయుటచేత లేక వాని అనుమతితో చేసిన ఎస్సోషియేటెడ్ ఆపరేషను అయి యుండుటచేత కంపెనీ ఆదాయ మూలములలో నొకటి అయిన ఆస్తి 17 వ సెక్షనుకొరకు ఆ వ్యక్తి ఆ ఆస్తిని కంపెనీకి ట్రాన్స్ఫరు చేసినట్లెంచబడును.

**5.** కంపెనీవల్ల చనిపోయినవానికి కలుగు లాభములు :

1. ఈ క్రిందవి చనిపోయినవానికి కంపెనీవల్ల కలిగిన లాభములుగా ఎంచబడును:—

(ఎ) తన స్వంతలాభము నిమిత్తము డైరెక్టుగా నైనను ఇన్డైరెక్టుగా నైనను, కంపెనీ ఆదాయమూలములలో నుండి చనిపోయినవాడు పొందిన రాబడి, లేక కొంతకాలమున కొకసారి చొప్పున ఇచ్చు పేమెంటున్ను కంపెనీ తాలూకు భూమి భూమిగాను, ఇతర ఆస్తి ఆ రూపముగాను పొందిన అనుభవము లేక ఇతర రైటున్ను,

(బి) చనిపోయినవాడు పొందుటకు రైటుగల అట్టి రాబడి, పేమెంటు, అనుభవము.

(సి) చనిపోయినవాడు చనిపోవుటకు వెనుక 3 సంవత్సరముల లోపున తనంతట తానైనను, తన సమ్మతిని ఇంకొకరైనను చెలాయించగలిగిన ఏ పవరునైనను చెలాయించేయెడల తాను పొందకల్గియుండునట్టి రాబడి, పేమెంటు అనుభవమున్ను,

మరియు, పైన చెప్పినట్లు చనిపోవుటకు వెనుక 3 సంవత్సరములలోను చెలాయించగలిగిన పవరు చెలాయించుటచేత తాను పొందగలిగి యుండునట్టిన్ని, కంపెనీ ఆదాయమూలములలో నుండి లేక కంపెనీయొక్క ఖర్చున కొంతకాలమున కొకమారు ఇచ్చు పేమెంటుగాక, అట్టి పేమెంటు చనిపోయినవాడు పొందుటకు రైటు కలిగియుండెడి యెడలనున్ను, కాని నిజముగా అట్టి పేమెంటు పుచ్చుకొని, లేక పుచ్చుకొనుటకు రైటు కలిగియుండని యెడలనున్ను, తాను ఎప్పుడైతే పుచ్చుకొనుటకు రైటు కలిగెనో అప్పటినుంచి సగటు రేటున ఆ పేమెంటుమీద వచ్చు వడ్డీకి సమానమైన లాభమును కంపెనీనుండి పొందినట్లెంచబడును.

ఈ నిబంధనల నిమిత్తము 'కొంత కాలమున కొకసారి ఇచ్చు పేమెంటు' అనగా, డివిడెండు రూపకమైన పేమెంటు, లేక వడ్డీ, ఒకేమాటు ఏకమొత్తము ఇచ్చునదిగాక, వేతనము క్రింద ఇచ్చు పేమెంటున్ను, ఒకదానితో ఒకటి సంబంధము కలిగియున్నను లేకపోయినను, ఒకే సమానమైన మొత్తములు అయినను, లేక హెచ్చుతగ్గు మొత్తములైనను, సమానమైన లేక అసమానమైన కాలములలో ఇచ్చునవైనను పేమెంట్లు

**6.** లాభముపొందు నిమిత్తము హక్కు, లేక పవరు సరెండరు :

1. శివ ఉపనిబంధనకు లోబడి, చనిపోయినవాడు పైన గత నిబంధనలో చెప్పినరాబడి, పేమెంటు లేక అనుభవము పొందుటకు తనకు గల హక్కును లేక చలాయించగల పవరును, కిమ్మతునకైనను, కాకపోయినను, సరెండరు చేసినయెడల అట్టి సరెండరు జరుగకున్నపుడు వలెనే గత నిబంధన వర్తించును.

2. పైన చెప్పినరాబడి పేమెంటు లేక అనుభవములను పొందుటకు చనిపోయినవానికి ఉండురైటు, పవరులను అతడుచేసిన కంపెనీ షేర్లు, డిబెంచర్లు, లేక ఇతర ఆస్తి, రైటుల అన్యాక్రాంతము వల్ల పూర్తిగనైనను, కొంతవరకైనను ఏ పవరు లేక ఇతరరైటును తాను చలాయించుట చేతనైనను, చలాయించక ఉంచివేయుట చేతనైనను, అంతరింపచేసినను, నిలుపుచేసినను, లేక నమ్మకముతో కూడిన తాహతు (ఫిడ్యూషియరీ కెపేసిటీ) లోనిది గాక ఏ యితరరైటు పవరులనైనను నశింపుచేసినను, నిలుపు చేసినను లేక అట్టి అన్యాక్రాంతము లేక ఇతరచర్య జరిగియుండనిచో, అట్టి రాబడి, పేమెంటు అనుభవములను పొందుటకు రైటు కలిగియుండునప్పటికిన్నీ, వాటివల్ల పొందియుండక పోయినను చనిపోయినవాడు అట్టి రాబడి, పేమెంటు అనుభవములను సరెండరు చేసినట్లెంచబడును.

3. చనిపోయినవాని మరణముతో అంత్యమయ్యే 2 సంవత్సరముల ప్రారంభమునకు పూర్వము (లేక, పబ్లిక్కు ఛారిటబుల్ పర్పస్ నిమిత్తము చేయబడినయెడల 6 మాసములు ప్రారంభమునకు వెనుకను) సదుద్దేశముతో నిజముగా చేయబడిన సరెండరు అయి యుండి, ఆ రెండు సంవత్సరములలోను (లేక, 6 మాసముల లోను) చనిపోయినవాడు ఎన్నడూ అట్టి రాబడి పేమెంటు వగై

రాలను పుచ్చుకోకుండా చేయబడి, లేక పుచ్చుకొనుటకు రైటులేకుండా చేయబడినన్ని, లేక చలాయించగలిగిన పవరు ఏ తాహతులోనైనను చలాయించకుండాను, సరెండరువల్లగాని సరెండరు ఒక భాగమైన ఎస్పోషియేషన్ ఆపరేషనుల వల్లగాని కొంత కాలమున కొకసారి యిచ్చు పేమెంటు పుచ్చుకోకుండాను ఉన్నయెడల అట్టి సరెండరుకు ఈ నిబంధనలు వర్తించవు.

**7. లాభముల మొత్తము నిర్ణయము :**

1. 17 వ సెక్షను 3 వ సబ్ సెక్షను ప్రకారము కంపెనీనుండి చనిపోయినవానికి వచ్చులాభముల మొత్తము నిర్ణయించుటకు ఈ నిబంధనలు అమలుకు వచ్చును.
2. ఏ మొత్తమున్ను ఒక మారుకన్న ఎక్కువసార్లు లెఖ్ఖలోనికి తీసికొనబడవు.
3. చనిపోయినవాడు పుచ్చుకొనుటకు రైటు కలిగియుండి, నిజముగా పుచ్చుకొనియుండని లాభమును గురించిగాని, చలాయించ గలిగియుండి చలాయించియుండని పవరును గురించిగాని, సరెండరును గురించిగాని ఏ మొత్తమైనను అక్కవుంటులోనికి తీసికొనబడినయెడల, లాభముపొందుట, పవరు చలాయించుట వల్ల ఇతరలాభములు మీాద కలిగే పర్యవసానమును తగురీతిని ఆలోచించబడును.
4. చనిపోయినవాడు పుచ్చుకొనుటకు రైటు గలిగియుండి, పుచ్చుకోకుండా ఉన్నట్టిన్నీ, చలాయించుటకు పవరు కలిగియుండి చలాయించకుండా ఉండియున్నట్టిన్నీ, లేక సరెండరు చేయబడినట్టిన్నీ, సందర్భములలో అక్కవుంటులోనికి తీసుకోవలసిన మొత్తములు, చనిపోయినవాని మరణతేదీతో అంత్యమయ్యే 3 సంవత్సరములలోను, అతడు లాభములను క్లెయిం చేయు సందర్భములలోనున్ను, పవరు చలాయించు సందర్భములోను

న్ను, తన కత్యంత లాభకరముగ నుండునట్లు ప్రవర్తించిన యెడల, అక్కవుంటులోనికి తీసికోవలసి వచ్చియుండెడి మొత్తములు అగును. అట్లు చేయుటలో అతడు ఆక్లెయిముచేయు, పవదు చలాయించు, సందర్భములలో ఇచ్చియుండెడి ప్రతిఫలము కూడ గమనించబడును.

5. 4 వ ఉపనిబంధన నిమిత్తము అందు చెప్పియున్న ప్రతిఫలము ఇచ్చియుండుటచేత, చనిపోయినవానికి కలిగియుండెడి రాబడి తగ్గుదల, లేక అందువల్ల కంపెనీకి వచ్చియుండెడి రాబడి పెరుగుదల, నిర్ణయించుటలో ఆ ప్రతిఫలము సొమ్ముమీదగాని అందలి కిమ్మతుమీదగాని సగటు రేటు వడ్డీకి సమానమైన రాబడి ఆ ప్రతిఫలము నిచ్చియుండెడిదని అనుకొనబడును.

6. అక్కవుంటులోనికి తీసుకోబడు మొత్తములలో చనిపోయినవా డిచ్చియున్న, లేక ఇన్వవలసియుండు ఇన్కంటాక్సు లేక సూపర్ టాక్సు కూడ చేరియుండును.

7. కంపెనీయొక్క భూమిగాని, ఇతర ఆస్తిగాని, రైటుగాని ఆమట్టున అనుభవించు లాభమువిషయములో అక్కవుంటులోనికి తీసుకోబడు మొత్తము ఆ లాభమును చనిపోయినవాడు అనుభవించుచుండెడి కాలములో అనుభవించిన కిమ్మతు అయియుండును.

3. లాభములు కలుగు కాలము :

1. ఈ నిబంధన

(ఎ) చనిపోయినవానికి కంపెనీనుండి కలిగినలాభము, వాని మరణముతో అంత్యమయ్యే 3 సంవత్సరములలోను కలిగినదా లేక, ఏ ఒక అక్కవుంటింగు సంవత్సరములలో నైనా కలిగినదా, లేక మరి ఇంకొక అవసరమైన ఏ కాలమునందైనను కలిగినదా అనియు,

(బి) ఏ కాలములో కంపెనీయొక్క భూమి భూమిగాను, లేక ఇతర ఆస్తి ఆ ఆస్తిగాను, లేక అందలి రైటు రైటుగాను జరిగిన అనుభవము నిలచియున్నదా, అనియు,
నిర్ణయించు నిమిత్తము అమలుకు వచ్చును.

2. కంపెనీనుండి రాబడి, లేక కొంతకాలమున కొకమారు ఇచ్చు పేమెంటు అయిన చనిపోయినవాడు పొందిన లేక పొందుటకు రైటు కలిగియుండి పుచ్చుకోకుండా ఉన్నలాభము అతడు పుచ్చుకొనుటకు రైటు కలిగిన తక్షణమందే కలిగియున్న ట్లెంచబడును.

3. చనిపోయినవాడు చనిపోయిన తేదీతో అంత్యమయ్యే 3 సంవత్సరములలోను పవరు చలాయించి కంపెనీనుండి పుచ్చుకొనుటకు రైటు కలిగియుండియు అట్టి పవరు చలాయించకున్నట్టైన్నా, లేక సరెండరు చేసినట్టైన్నా, లాభముపై 7 వ నిబంధన 4 వ ఉపనిబంధనలో చెప్పినట్లెప్పుడు మొట్టమొదట దానిని పుచ్చుకొనుటకు పైనచెప్పినట్లు పరివర్తించెనో అప్పుడే లాభముకలిగినట్లెంచబడును.

4. చనిపోయినవాడు పుచ్చుకొనుటకు రైటుగల, కొంత కాలమున కొకసారి ఇచ్చునదిగాక, అట్టి పేమెంటుమీద ఏ అక్కవుంటింగు సంవత్సరములోనైనా వడ్డీ అయిన లాభము, ఏ కాలమున కది వడ్డీగా పెరిగినదో అంతమట్టుకు ఆ సంవత్సరములలో పెరిగినట్లెంచబడును.

5. చనిపోయినవాడు ఏ ఆస్తి అయినను ఆ మట్టున అనుభవించే లాభము ఏ కాలములో ఆ అనుభవము ఉండునో ఆ కాలము ఏ అక్కవుంటింగు సంవత్సములో పడునో ఆ అక్కవుంటింగు సంవత్సరముతో కూడిన 3 సంవత్సరములలోను కలిగినట్లెంచబడును.

6. పైన చెప్పిన ఆస్తి ఆస్తిగా అనుభవించు లాభము ఈ క్రింద చెప్పబడిన కాలమునకు నిలచియున్న ట్లెంచబడును.

(ఎ) అనుభవము విషయములో చనిపోయినవాడు ఏ కాలములో అనుభవించెనో ఆ కాలము.

(బి) అనుభవించుటకు హక్కు కలిగియూ, అనుభవించని విషయములో ఏ కాలములో అనుభవము పొందకలిగియుండెనో ఆ కాలము.

(సి) చనిపోయిననాటితో అంత్యమయ్యే 3 సంవత్సరములలోను చనిపోయినవాడు పవరు చలాయించే యెడల అనుభవము పొందుటకు రైటు కలిగియుండెడిన్ని, కాని అట్లు చలాయించనట్టిన్ని విషయములోను, లేక పరెండవ విషయములోను 7 వ నిబంధన 4 వ ఉపనిబంధనలో చెప్పినప్రకారము అతడు ప్రవర్తించినయెడల ఏ కాలములో అట్టి అనుభవము కలిగియుండెడివాడో, ఆ కాలము.

**9. కంపెనీయొక్క నికరాదాయము, లేక నష్టముల నిర్ణయము :**

1. కంపెనీయొక్క ఏ అక్కవుంటింగు సంవత్సరమునకైనను లేక, గత అక్కవుంటింగు సంవత్సరం ఆఖరుకున్ను మరణమునకున్ను మధ్యకాలమునకైనను, రాబడి ఇందలి 2,3 ఉపనిబంధనలకు లోబడి 1922వ ఇన్కంటాక్సు ఆక్టు (1922 వ 11వ ఆక్టు) ప్రకారము, కంపెనీకి వచ్చే అన్ని బాపతులు రాబడిన్ని కలిపి, వ్యవసాయపు భూముల ఆదాయము మాత్రము వేరే తేల్చి, మామూలు వ్యాపారముతో బోనాఫైడీగా సంపాదించబడని రాబడిన్ని, కంపెనీకి రాబడి ఎసెట్లను ఇచ్చే అయివజులనున్ను కంపెనీ రాబడిలో నుంచి మినహాయించి, నిర్ణయించవలెను.

2. ఇన్కంటాక్సు ఆక్టులో ఏమి చెప్పియున్నను, ఇంకొక ఏ సంవత్సరముయొక్క రాబడితోను నిమిత్తం లేకుండా, మనకు రావ

లసిన సంవత్సరమునకు వచ్చేడివాబడి చేసే లెక్క తేల్చవలెను.

3. లెక్క కట్టుటలో ఈ క్రింది విధమైన మినహాయింపులు చేయరాదు.

 (ఎ) ఆ సంవత్సరమునకు, లేక కాలమునకు పూర్వము వచ్చిన నష్టము.

 (బి) ఇన్కంటాక్సు ఆక్టు 10 వ సెక్షను 2 వ సబ్ సెక్షను 6 వ క్లాజు ప్రొవైజో (బి) లోని డిప్రిసియేషనును బట్టి మినహాయించదగిన మొత్తము, లేక,

 (సి) కంపెనీ షేర్లమీద డివిడెండు, డిబెంచర్లమీద వడ్డీ, ప్రత్యేకము పూర్తిగా కంపెనీ వ్యాపారము నిమిత్తము చేయబడని ఋణములున్ను,

4. కంపెనీయొక్క వ్యవసాయపు రాబడి, ఇన్కంటాక్సు ఆక్టు 12వ సెక్షను 2 వ సబ్ సెక్షను ప్రకారం లెక్క కట్టవలెను.

5. రాబడి నిర్ణయించుటలో, ప్రతీ సంవత్సరమున కొకసారి ఇవ్వవలసిన హామీ బాకీయున్ను, డిబెంచర్లమీద వడ్డీగాక ఇతర వడ్డీయున్ను, దానిమీద పన్ను రాబట్టబడినను లేక పోయినను సరే.

6. 1,2,3 ఉపనిబంధనలు సందర్భానుసారముగ తగు మార్పులతో నికరరాబడి నిర్ణయించుటకు వర్తించినట్లే, కంపెనీపొందిన నష్టమును నిర్ణయించుటకు కూడ వర్తించును.

**10.** కంపెనీ ఎసెట్ల కిమ్మతు నిర్ణయించుట :

1. ఎస్టేటు డ్యూటీ నిమిత్తము ఎస్టేటుయొక్క కిమ్మతు నిర్ధారణ చేయుటలో 17 వ సెక్షను ననుసరించి, చనిపోయినమీదట వ్యాపనయే కంపెనీ ఎసెట్లు బాధ్యత గలిగియుండు ఏ ఋణము, బాధ్యతకున్ను, ఋణములకు బాధ్యతలకు మినహా ఇచ్చు 44 వ సెక్షను వర్తించదు.

కాని, ఆ ఎసెట్ల అసలు కిమ్మతులో నుండి, కంపెనీయొక్క బాధ్యతలను, చనిపోయిననాటికి ఇవ్వతేలని బాధ్యతల విషయములో ఆ నాటికి వాటి కిమ్మతు కట్టి, అంత మట్టుకున్ను, కొన్ని సందర్భములలో ఇవ్వవలసి వచ్చు కంటింజెంటు బాధ్యతల విషయములో కంట్రోలరుకును న్యాయమని తోచునంత మట్టుకున్ను, ఈ క్రింద చెప్పినవి గాక, కంట్రోలరు మినహాయించవలెను.

(ఎ) షేర్లు డిబెంచర్ల విషయమైన కంపెనీ బాధ్యతలు, మరియు,

(బి) కంపెనీ వ్యాపారం నిమిత్తము ప్రత్యేకము పూర్తిగా చేయబడినవి గాక, మిగతా ఇతర బాధ్యతలు.

2. ఎసెట్ల అసలు కిమ్మతు నిర్ణయించుటలో, నడచుచున్న కంపెనీ వ్యాపారము అమ్మినయెడల వచ్చు కిమ్మతు ఆధారముపైన కంట్రోలరు నిర్ణయించవలెను.

3. పంచిన ఎసెట్లు అయి (17 వ సెక్షను వర్తించు కంపెనీ షేర్లు డిబెంచర్లయొక్క రైట్లు సళింపుచేయుట, లేక మార్పుచేయుటలు గాక) పంపకము చేయుటకు, కంపెనీ స్వంత ఉపయోగము నిమిత్తము, రొఖ్ఖిలేక, తత్తుల్య ప్రతిఫలము కొంతవరకు ఇచ్చియున్నయెడల 1 వ ఉపనిబంధనలో ఇచ్చేడి మినహాయింపు గాక అదనముగా ఇచ్చిన ప్రతిఫలమని మొత్తమునకు సమానమైన మొత్తము కూడా కంట్రోలరు మినహా ఇవ్వవలెను.

4. పంపకము చేయబడిన ఏ ఎసెట్లయొక్క అయినను అసలుకిమ్మతు ఎస్టిమేటు చేయుటకు ఈ ఆక్టు 36 వ సెక్షనులో మరణకాలము అన్న చోట అందుకు బదులు పంపకము చేయబడిన కాలము అని మార్చిన్నీ, మరణమువల్ల డిసీజ్ పిరియేషనును గురించి చెప్పిన ప్రొవైజోలో పంపకకాలము అని మార్చిన్నీ ఆ సెక్షను వర్తించును. మరియు, ఆ కాలమునకు మరణించినవాని జీవితపు పరిమాణమును గురించి కూడా సమంజసమైన ఆలోచన చేయబడును.

**11.** రెండు మారులు విధింపులేకుండ చేయుటకు విధానము :

1. (ఎ) 17 వ సెక్షను 1 వ సబ్ సెక్షనులో చెప్పిన చనిపోయిన వాడు కంపెనీకి ట్రాన్సుఫరుచేసిన ఆస్తి కిమ్మతున్ను, అందు పై ట్రాన్స్ఫరు తేదీనుండి మరణ తేదీవరకు సగటు రేటున వడ్డీకి సమానమైన మొత్తములో నుండి ట్రాన్సుఫరువల్ల చనిపోయినవాడు పెచ్చుకున్న లాభమును తీసివేయగా వచ్చు తేడా (పెచ్చు) మొత్తమున్ను కలిపిన మొత్తము.

   (బి) మరణించినవాడు ట్రాన్స్ఫరువల్ల పుచ్చుకున్న లాభములు గాక, కంపెనీనుండి పుచ్చుకున్న అన్ని ఇతరలాభములు లెక్కచేయనియెడల 17 వ సెక్షను క్రింద మరణానంతరము ఏ కిమ్మతుమీద ఎస్టేటుడ్యూటీ విధించబడునో అట్టి కిమ్మతు. కన్న తక్కువ అయినయెడల, ఆలో తక్కువ అయిన మొత్తమునకు సమానమైన మొత్తమును ట్రాన్సుఫరువల్ల పొందిన లాభమునకు కరస్పాండు అయే కంపెనీ ఎసెట్ల కిమ్మతు ప్రపోర్షనులో నుండి తీసివేయబడును.

   ఈ ఉపనిబంధనలో చనిపోయినవాడు ట్రాన్సుఫరువల్ల పుచ్చుకున్న లాభములు అని చెప్పినది, కంపెనీ పొందిన లాభమునకు ప్రతిఫలముగా చనిపోయినవానికి కంపెనీనుండి కలుగులాభములు అనిన్నీ, లేక ట్రాన్సుఫరుకు ప్రతి ఫలముగా చనిపోయినవాడు పుచ్చుకున్న షేర్లు, డిబెంచర్లు లేక ఇతర ఆస్తివల్ల వానికి కంపెనీ కలుగచేయు లాభములు అనిన్నీ అర్థము.

2. ఈ క్రింది షరతులు తృప్తి అయినప్పుడు, అనగా చనిపోవుటకు మూడు సంవత్సరములు ముందు చనిపోయినవాడు కంపెనీ యొక్క ఏ షేర్లు, డిబెంచర్లు అయినను తన స్వలాభము నిమిత్తము రొక్కము లేక తత్తుల్య ప్రతి ఫలమునకు ట్రాన్సుఫరు చేసినప్పుడున్ను, మరియు ఆ షేర్లు డిబెంచర్లవల్లనైనను, లేక వాటిని సంబంధించి వాని సమ్మతిని ఏ పవరునైనను చలాయించ

గలుగుటవల్లనైననుు వానికి ఏ లాభముల్లైనను కలిగినయెడల నున్ను,

(ఎ) ఆ ప్రతిఫలం కిమ్మతు వానికి కలిగిన లాభమునకు కరస్పాండు అయ్యే కంపెనీ ఎసెట్ల కిమ్మతు ప్రపోర్షనుతో సమానమైనను పూర్తిగా నిర్ణయమైనయెడల ప్రతిఫలం కన్న లెఖ్ఖించతగినంత ఎక్కువకాదని కంట్రోలరు తృప్తిచేయబడినను ఆ ప్రపోర్షనుమీద డ్యూటీ చెల్లించనక్కరలేదు.

(బి) ఇతర కేసులలో ఆ ప్రపోర్షను విషయమై డ్యూటీఛార్జిచేయదగిన మొత్తములో నుంచి ప్రతిఫల మొత్తము కిమ్మతు తీసివేయబడును.

కాని, ఏ షేర్లు డిబెంచర్లు విషయములోనైనను,

(i) మరణానంతరము వాటి కిమ్మతుపైన, లేక ఆ కిమ్మతులో ఏ భాగమునకైనను ఎస్టేటుడ్యూటీ చెల్లించవలసి యుండేనున్న లేక మినహాయింపు లేకుండేనున్న అట్టి డ్యూటీ చెల్లించవలసి యుండేనున్న ఈ ఉపనిబంధన వర్తించదు. మరియు,

(ii) ఆ షేర్లు డిబెంచర్ల అన్యాక్రాంతము ఎంతమట్టుకు ఈ ఉపనిబంధనలోని కండిషనులు తృప్తిపరచునో నిర్ణయించు నిమిత్తము (కంపెనీ ద్వారా జరుపబడిన వ్యాపారములకు సంబంధించు) 16 వ నిబంధన 26 వ సెక్షను కొరకు వర్తించు విధముగానే వర్తించును.

3. ఈ క్రింది కండిషనులు తృప్తి అయినయెడల అనగా కంపెనీ షేర్లు డిబెంచర్లలో చనిపోయినవానికి ఎప్పుడైనను ఏ విధమైన ఇంటరెస్టు అయినను ఉండుటచేతనైనను లేక కంపెనీ షేర్లు డిబెంచర్ల విషయములో ఎప్పుడైనను ఏ పవరునైనను చలాయించగలుగుటచేతనైనను కంపెనీనుండి చనిపోయినవానికి ఏ లాభములైనను వచ్చినయెడలనున్ను, మరియు ఈ నిబంధనతో నిమిత్తము లేకుండా 17 వ సెక్షను కాక ఇతర ప్రొవిజనులప్రకారము ఆ షేర్లు డిబెంచర్ల కిమ్మతుమీాదనున్ను, ఆ సెక్షను ప్రకా

రము చనిపోయినవానికి కలిగిన లాభములకు కరెస్పాండు అగు కంపెనీ ఎసెట్ల కిమ్మతు ప్రపోర్షను మీదనున్నా కూడా మరణానంతరము ఎస్టేటుడ్యూటీ చెల్లించవలసి వచ్చునెడలనున్నూ, అప్పుడు-

(ఎ) ఆ ప్రపోర్షనుకన్నా షేర్లు డిబెంచర్ల కిమ్మతు ఎక్కువ అయినను దానితో సమానమైనను లేక పూర్తిగా నిర్ధారణచేయబడినయెడల ఆ ప్రపోర్షను షేర్లు, కిమ్మతుకంటె లెక్కింపదగినంత ఎక్కువ ఉండదని కంట్రోలరు తృప్తిపరుపబడిన యెడలనున్నూ, అట్టి ప్రపోర్షనుమీద డ్యూటీ చెల్లించనక్కరలేదు.

(బి) ఇంక నే కేసులోనైనను ఆ ప్రపోర్షను విషయమై డ్యూటీ ఛార్జిచేయవలసిన మొత్తములో నుంచి షేర్లు డిబెంచర్ల కిమ్మతు మొత్తము తగ్గించివేయవలెను.

4. షేర్లు డిబెంచర్లయందు చనిపోయినవాని మరణమువల్ల అంత్యమయ్యే ఇంటరెస్టు ఒక ఆఫీసుహోల్డరుగా కలిగియున్నాడనే కారణముచేత ఉండు తప్పింపు (Exemption) కాక, ఇతర విధముగా ఉండు ఎస్టేటు డ్యూటీనుండి తప్పింపు కారణముచేత గతపై ఉపనిబంధనలో చెప్పబడిన కండిషనులు తృప్తిపడే యెడల షేర్లు డిబెంచర్ల కిమ్మతుమీద ఎస్టేటుడ్యూటీ చెల్లించనక్కర లేనప్పుడు, ఆ ఉపనిబంధనలోని (ఎ), (బి) పేరాలలో షేర్లు డిబెంచర్ల కిమ్మతుమీద డ్యూటీ చెల్లించవలెననిన్నీ, తప్పింపు వర్తించదనియు ఉండియున్నట్లు ఆ పేరాలు వర్తించును.

కాని,

(ఎ) అంతకన్నా వెనుకటి మరణానంతరం ఎట్టి డ్యూటీ పేమెంటుమీదనైనా అట్టి డ్యూటీనుండి తప్పింపు ఆధారపడునెడలను లేక అట్టి పేమెంటుమీద ఆధారపడక, పూర్తిగానైనను కొంతవరకు అయినను ఏ అన్యాక్రాంతములు చేయుట

మీదనైనను ఆధారపడే యెడలనున్ను, మరియు,

(బి) ఆ మరణ లేక అన్యాక్రాంతపు తేదీకి దర్శిలాను ఎవరివల్ల నైనను ఏ కంపెనీకైనను ఆస్తి ట్రాన్సఫరు చేయబడుటచేత లేక ఏకంపెనీయొక్క షేర్లు డిబెంచర్లకు సంబంధించిన రైట్లు నశింపులేక మార్పుచేయుటచేత, షేర్లు డిబెంచర్ల కిమ్మతు బాగా ఎక్కువ చేయబడినయెడలనున్ను,

అప్పుడు, షేర్లు డిబెంచర్ల కిమ్మతుతో సంబంధము లేకుండా ఒకస్థిర మొత్తము ఆషేర్లు డిబెంచర్ల కిమ్మతులో నుండి తగ్గించుసూపకమైన డ్యూటీనుండి తప్పింపు అయితే తప్ప, ఆక్రిందటి ఉపనింధన (ఎ), (బి) పేరాలలో చెప్పబడిన షేర్లు డిబెంచర్ల కిమ్మతు అని చెప్పినది, కంట్రోలరు అభిప్రాయములో ఆకిమ్మతు, ఆస్తి ట్రాన్సఫరు, రైట్లునశింపు లేక మార్పులకు చెందునంతమట్టుకు తగ్గించబడిన వాటి కిమ్మతు అని చెప్పినట్లుగా అమలుకు వచ్చును.

(5) ఎస్టేటు డ్యూటీనుండి ఒకతప్పింపు కారణమున షేర్లు డిబెంచర్ల కిమ్మతులో కొంత మీదనే డ్యూటీ చెల్లించవలసి యున్నయెడల, 3 వ ఉపనిబంధన తగు మార్పులతో డ్యూటీ చెల్లించవలసిన షేర్లుడిబెంచర్ల కిమ్మతులోని భాగమునకు వర్తింపచేయవలెను. డ్యూటీనుండి తప్పింపు వర్తించు షేర్ల డిబెంచర్ల కిమ్మతులోని భాగమునకు 3 వ ఉపనిబంధన వర్తింప చేయవలెను. మరియు, ఒక్కొక్కటి, షేర్లుడిబెంచర్ల కిమ్మతులోని వేరువేరు భాగములకు వర్తించు 2 గాని, ఎక్కువగాని డ్యూటీ తప్పింపు లున్నపుడున్ను, ఆ భాగములకు 4 వ ఉపనిబంధన వేరువేరుగ పనిచేయునట్టి తప్పింపులై యున్నపుడున్ను, ఎస్టేటు డ్యూటీ చెల్లించవలసిన షేర్లు డిబెంచర్ల కిమ్మతులోని భాగమేమైనను ఉన్నను లేకపోయినను, 4 వ ఉపనిబంధన తగుమార్పులతో వేరువేరుగా వేరువేరు తప్పింపులుగల కిమ్మతు భాగములకు వర్తింపచేయవలెను.

(6) ఈ నిబంధనలో 'ఎస్టేటు డ్యూటీనుండి తప్పింపులు' అను మాటలలో 'ఆస్తిని అంతనూగాని కొంతనుగాని డ్యూటీనుండి తప్పించు ఈఆక్టులోని ఏ ప్రొవిజను అయినను, అది ఆస్తి ప్యాసైన క్లైంచబడదు' అనే రూపముగాని, 'డ్యూటీచెల్లించ నక్కర లేదు' అనే రూపముగాని, 'ఆస్తి కిమ్మతులోనుండి మినహాయించవలెను' అనే రూపముగాని, మరియేయితర రూపముగాని తీసికొని యుండవచ్చును. మరియు, 4 వ ఉపనిబంధనలో ప్రొవైజోలో బి పేరాగ్రాపులో 'షేర్లు డిబెంచర్ల కిమ్మతులో వృద్ధి' అని చెప్పినదానిలో, ఆషేర్లు లేక డిబెంచర్లు మరియేయితర ఆస్తికిబదులుగా సంపాదింపబడి నపుడు, ఆషేర్లు డిబెంచర్లు రిప్రిజెంటుచేయు ఏఆస్తి కిమ్మతులో నైనను వృద్ధిచేరియుండును.

(7) ఈ నిబంధనలో ఏ ఒక ప్రత్యేక లాభమున కైనను సరిపడు (కరెస్పాండగు) కంపెనీ ఎసెట్ల కిమ్మతు ప్రపోర్షను అని చెప్పినది, 17 వ సెక్షను ప్రకారము అట్టి లాభములను ఆ సెక్షను 2 వ సబ్ సెక్షను క్రింద కట్టే లెఖలోనికి తీసికొని వచ్చుటచేత మరణానంతరం ఎంతమీాద ఎస్టేటు డ్యూటీ విధించబడునో అంతమట్టుకు కిమ్మతు అని అర్థము.

(6) 5 వ నిబంధనలో చెప్పబడినట్టిన్ని కంపెనీలో ఏ ఆఫీసు హోల్డరుగా నైనను పనిచేసినందుకు న్యాయముగా ఇవ్వబడిన లేక ఇవ్వవలసివచ్చు జీతము లేక వేతనమును రిప్రిజెంటు చేయునని కంట్రోలరుకు తృప్తికలుగ చేయబడు నంతటిన్ని, రాబడి, కొంతకాలమున కొకసారి యిచ్చు పేమెంటు లేక అనుభవము 5 వ నిబంధనలో చెప్పినది లెఖలేకుండా ఈ నిబంధనల నిమిత్తము చనిపోయినవానికి వచ్చు లాభములుగా నెంచబడవు. మరియు, కంట్రోలరుకు తృప్తికలుగునంత మట్టుకు అట్లు ఆఫీసులో హోల్డరుగా పనిచేసిన వానికి జీతము ఇచ్చే బాధ్యత, కంపెనీ వ్యాపారము నిమిత్తము కంపెనీవల్ల చేయబడిన ఖర్చుగా నెంచబడును.

9. 3 వ ఉపనిబంధన నిమిత్తము, రిలవెంటు అక్కౌంటింగు సంవత్సరములలో కంపెనీనుండి చనిపోయినవానికి వచ్చినలాభములలో ఆఉపనిబంధనలో చెప్పినట్లుగాగాక, ఇతరత్రావచ్చిన లాభములుకూడియున్న యెడలనున్ను, కాని, చనిపోయినవాడు ఎప్పుడైనను ఆఉపనిబంధనవల్ల కాకుండగా వాని మరణానంతరం ఎస్టేటుడ్యూటీ చెల్లించవలసియుండు, కంపెనీ షేర్లు డిబెంచర్లలో చనిపోయినవాడు ఒక ఇంటరెస్టు లేక చెలాయించు పవరు కలిగియున్న యెడలనున్ను, మరియూ ఆఇంటరెస్టు, ప్రవరులువల్ల ఆసంవత్సరములలో చనిపోయినవారికి లాభములు కలిగియున్నను లేక, ఆషేర్లు డిబెంచర్లకు సంబంధించిన రైట్లవల్ల ఏపేమెంటుఅయినా చేసినచో కలిగియుండునెడనున్ను, అప్పుడు—

(ఎ) మొదటచెప్పినలాభములు ఎంతమట్టుకైనా, అట్లు వినియోగించబడియుండనియెడల, ఆఖరునచెప్పినలాభములను వృద్ధిచేయుటకు వినియోగించగలిగినసొమ్ములోనుంచి ఇచ్చిన పేమెంట్లు అయియున్న యెడల, లేక, అట్టిలాభములు అగు పేమెంట్లు అయియున్న యెడలనున్ను, లేక,

(బి) ఆఖరునచెప్పినలాభములు పూర్తిగవదలివేసి, 17 వ సెక్షను 2 వ సబ్ సెక్షనుక్రింద కట్టినలెఖ్ఖలోనికి, మొదటచెప్పిన లాభములు తీసుకోబడినయెడలనున్ను,

అంతమట్టుకు మొదటచెప్పిన లాభములు, షేర్లుడిబెంచర్లలో చనిపోయినవానికి ఉన్న ఇంటరెస్టువల్లవచ్చిన లాభములుగా ఎంచబడును.

## 12 పంపకముచేయబడిన ఎసెట్ల సర్దుబాట్లు :

1. 17 వ సెక్షనుప్రకారము చనిపోయినవాని మరణానంతరము ప్యాసయే కంపెనీ ఎసెట్లలో పంపకముచేయబడిన ఎసెట్లుకూడి

యున్నను, లేక, మరణమునకు పూర్వము, కంపెనీ ఎత్తివేయుట డిసాల్వుచేయుటవల్ల, కంపెనీ ఎసెట్లలో పంపకముచేయబడిన ఎసెట్లు కూడియున్నను, ఈక్రింది ఉపనిబంధనలు వర్తించును.

2. కంపెనీరాబడిలో ప్రతిపంపకమునకు పంపకము తేదీలగాయతు పంపకపుసొమ్ముపై సగటు రేటున వడ్డీకూడియున్నట్లుగానున్ను, లేక, ఆవడ్డీకి సమమైన కిమ్మతును కంపెనీకివచ్చియున్నట్లున్ను ఎంచి, కంపెనీ నికరాదాయము నిర్ణయించవలెను.

3. ఏపంపకములోనైనను చనిపోయినవాడు, పంపకముచేయ బడిన ఏఎసెట్లలోనైనను వానికి లాభకరమగు యింటరెస్టు పుచ్చుకున్నయెడల, కంపెనీనుండి చనిపోయినవాడు పొందిన లాభము నిర్ణయించుట ఎట్లనగా; పై ఉపనిబంధనక్రింద ఆఎసెట్ల పంపకముకిమ్మతు అని కంపెనీరాబడిలోనికి తీసుకురాబడిన మొత్తము, చనిపోయినవాడు కంపెనీకి వచ్చినవెంటనే తీసికొనుటకు రైటు కలిగియున్నట్లెంచి, లేక చనిపోయినవాడు పుచ్చుకున్న ఆ ఎసెట్లలోని ఇంటరెస్టు సంపూర్ణమైన ఇంటరెస్టు కన్న తక్కువ అయినయెడల ఆ ఇంటరెస్టు కిమ్మతుకున్ను ఎసెట్ల కిమ్మతుకున్ను ఉండే ప్రపోర్షనుకు కరెస్పాండగు రాబడి అయి యున్నట్లు ఎంచిన్ని నిర్ణయించవలెను.

(4) 3 వ ఉపనిబంధన వర్తించే యెడల,

(ఎ) ఈ ప్రొవిజనుతో నిమిత్తం లేకుండా, మరణానంతరం ఎస్టేటు డ్యూటీకి చెల్లించవలసిన కిమ్మతులో నుంచి ఎసెట్ల పంపకము కిమ్మతు తీసివేసి లేక చనిపోయినవాడు పుచ్చుకున్న ఇంటరెస్టు సంపూర్ణమైన ఇంటరెస్టు కన్న తక్కువ అయిన యెడల, ఆ కిమ్మతులో అట్టి ప్రపోర్షనుకు సమానమైన మొత్తము తీసివేసి, మరియు,

(బి) కంపెనీనుండి చనిపోయినవానికి ఆ ఉపనిబంధనవల్ల వచ్చిన లాభముగా ఎంచబడిన మొత్తము 11 వ నిబంధన 1 వ ఉపనిబంధన క్రిందవాడు పుచ్చుకున్న లాభముగా నెంచ

బడును.

13. ఎసెట్లకు చేర్పుల సర్దుబాట్లు :

1. రిలవెంటు ఎక్కవుంటింగు సంవత్సరములలో మొదటి సంవత్స రం ప్రారంభమునకున్ను మరణమునకున్ను మధ్యగల కాలము లో కంపెనీ, ఇన్కంటాక్సు, సూపర్ టాక్సు చెల్లించవలసి వచ్చురాబడి వచ్చుటవల్లగాక యితరత్రా కంపెనీ ఎసెట్లకు వృద్ధికలిగిన కారణముచేత చనిపోయినవాని మరణానంతరం 17 వ సెక్షను ప్రకారము వ్యాపయే కంపెనీ ఎసెట్ల అసలు కిమ్మతు

   (ఎ) కంపెనీ షేర్లు డిబెంచర్లు ఇస్యూచేసినందుకు ప్రతిఫలము గా నైనను; లేక,

   (బి) పూర్తియైన రొఖ్ఖ లేక, తత్తుల్య ప్రతి ఫలమునకు కొనుట గాక ఇతరత్రానైనను,

   ఎక్కువ చేయబడినయెడల, ఆ ఎక్కువ చేయబడిన ఎసెట్ల విషయమై ఈ క్రింది ప్రొవిజనులు అమలుకు వచ్చును.

2. కంపెనీ రాబడిలో కలిపిన కలుపు కిమ్మతుకు సమానమైన మొత్తముమీద మొదటి రిలవెంటు ఎక్కవుంటింగు సంవత్సరం ప్రారంభమునుంచి కలుపు తేదీవరకు సగటు రేటు వడ్డీకూడ కలసియున్న శ్లెంచి, కంపెనీ నికరాదాయం నిర్ధారణ చేయ వలెను.

3. చేర్చిన అన్ని లేక కొన్ని ఎసెట్లు చనిపోయినవానివల్ల కంపె నీకి ట్రాన్సఫరు చేయబడినయెడల క్రిందటి ఉపనిబంధన ప్రకార ము ఆ ఎసెట్ల కలుపుడు కిమ్మతును బట్టి కంపెనీ రాబడిలోనికి తీసుకొని రాబడినట్టిన్ని కంపెనీకి వచ్చినవెంటనే చనిపోయిన వాడు పుచ్చుకొనుటకు రైటు కలిగినట్టిన్ని లేక ట్రాన్సఫరుచేసిన ఇంటరెస్టుకున్ను ఎసెట్ల కిమ్మతుకున్ను ఉండు ప్రపోర్షనుమట్టుకు అట్టి రాబడిగా ఎంచిన్ని, మొత్తము కంపెనీయొక్క రాబడిగా ఎంచిన్ని కంపెనీనుండి చనిపోయినవానికి వచ్చినలాభములు

నిర్ణయించవలెను.

4. 3 వ ఉపనిబంధన వర్తించునప్పుడు ఎసెట్లు కలుపుడుకు ప్రతిఫలముగా కంపెనీషేర్లు డిబెంచర్లయందు మరణానంతరము ఎస్టేటు డ్యూటీ చెల్లించవలసి వచ్చు ఏ ఇంటరెస్టు అయిననూ పుచ్చుకున్న యెడల 11 వ నిబంధన 3 వ ఉపనిబంధనలోని దేనితోను నిమిత్తము లేకుండా కంపెనీనుండి చనిపోయినవానికి క్రిందటి ఉపనిబంధనప్రకారము లాభముగా నెంచబడు మొత్తము సదరు 11 వ నిబంధన 3 వ ఉపనిబంధన నిమిత్తము అట్టి షేర్లు డిబెంచర్లయందుగల ఇంటరెస్టువల్ల కలిగిన లాభముగా నెంచబడును.

5. ఈ నిబంధనలో కలిపిన ఎసెట్లుకు సంబంధించిన కలుపుడు కిమ్మతు అంటే, వాటి కిమ్మతు లేక కంపెనీషేర్లు డిబెంచర్లలో ఉండు రైట్లు మార్పుగాక కొంతమట్టుకు మాత్రమే ఇసూ్యచేయుటకున్ను లేక మార్పుచేయుటకున్ను రొఖ్ఖ లేక తత్తుల్య ప్రతిఫలం కంపెనీ ఆదాయ మూలమునుండి లేక కంపెనీ ఖర్చుకు యివ్వబడినయెడల అందలి కిమ్మతులోనుండి ప్రతిఫలం కిమ్మతు తీసివేసిన మొత్తము అని అర్థము.

**14.** ఎక్కవుంటింగు సంవత్సరం :

1. 'ఎక్కవుంటింగు సంవత్సరం' అనగా చనిపోయినవాని మరణమునకు పూర్వము వాని జీవితకాలములో ఆఖరుసంవత్సరంతో అంత్యమయ్యే 12 మాసములకు అక్కవుంటు తయారుచేసిన యెడల ఆ 12 మాసముల కాలమున్ను అంతకు వెనుకటి ప్రతీ 12 మాసములున్ను లేక ఎక్కవుంటు పూర్తిచేసిన కాలమునకు సరిపడు తేదీతో అంత్యమగు ఇతర కాలమున్ను లేక అట్లు చేయనియెడల వాని జీవితములో కంట్రోలరు నిర్ణయించే కాలముతో అంత్యమయ్యే 12 మాసములు లేక ఇతర కాలమున్ను, అంతకుపూర్వపు 12 చేసి మాసములున్ను అని అర్థము.

2. 'రిలవెంటు ఎక్కవుంటింగు సంవత్సరములు' అనగా 17వ సెక్ష

ను క్రింద ప్యాసయే ఎసెట్ల పరిమితి నిర్ణయించుటకు ఏ సంవత్స రమునకు సంబంధించి చెప్పబడెనో అట్టి అక్కౌంటింగు సంవత్సరములు.

3. కంపెనీకి ఎప్పటివరకు అక్కౌంట్లు ఉంచబడెనో అట్టిసంవత్స రముతో అక్కౌంటింగు సంవత్సరము సరిపడనప్పుడు ఆసంవత్స రమునకు కంపెనీయొక్క రాబడిలేక, నికరరాబడి తేల్చుటకు కంట్రోలరు ఆకాలమును విభజించి, సర్దుబాట్లుచేసి, కూడ వచ్చును. ఆసర్దుబాట్లు ఆనెలలు, ఆనెలలభాగములు సరిపడు నట్లు చేయవలెను.

**15.** కొన్ని కంపెనీషేర్ల డిబెంచర్లుఎస్టేటుడ్యూటీ నిమిత్తము కిమ్మతు కట్టుట:

1. కంట్రోల్డు కంపెనీలోని షేర్లు, ఎసెట్లు, ఎస్టేటుడ్యూటీనిమిత్తం ఒకరి మరణానంతరం ప్యాసయేటప్పుడు,

   (ఎ) చనిపోయినవాని మరణముతో అంత్యమయ్యే మూడు సంవత్సరములలోను ఎప్పుడైనను చనిపోయినవాడు కంపెనీ పైకంట్రోలు కలిగియున్నయెడల లేక,

   (బి) ఆమూడుసంవత్సరములలోను పూర్తిగానైనా, కొంతలో నైనా కంపెనీవల్ల డిక్లేరు చేయబడిన లేక ఏకాలమునకు డిక్లేరు చేయబడియుండక, ఆ మూడు సంవత్సరములలోను ఒక కాలమున కంపెనీ డిబెంచర్లపై వడ్డీనిమిత్తము యివ్వ తేలిన మొత్తముతో సహా డిక్లేరుచేయుబడిన డివిడెండ్లు మొత్తముమీద అడివిడెండ్ల మొత్తములో సగముకు పైగా నుండి 5, లేక 6 నిబంధనలప్రకారం కంపెనీనుండి చనిపో నవానికి కలిగిన లాభములుగా ఎంచబడి, లేక, చనిపోయిన వాడు కంపెనీపేర ఆస్తిట్రాన్స్ఫరు చేసినయెడల అర్పించ బడునవి అయినయెడల, లేక,

   (సి) ఆమూడు సంవత్సరములలోను ఎప్పుడైనను కంపెనీషేర్లలో గాని డిబెంచర్లయందుగాని, లేక, రెండింటిలోనుకూడ,

స్వాధీనపులాభకరమైన ఇంటిరెంట్లు, అప్పుడు ఇస్యూచేసిన కంపెనీ షేర్లు డిబెంచర్ల అగ్రిగేటునామినలు మొత్తములో సగములేక అంతకన్న ఎక్కువ మొత్తమును తెలుపు అగ్రిగేటు నామినల్ మొత్తము చనిపోయినవాడు కలిగియున్న యెడలనున్ను, మరియొకరెవరున్ను అప్పుడు కంట్రోలు కలిగియుండని యెడలనున్ను; ఈయాక్టు 36 వ సెక్షను 1వ సబ్ సెక్షనుక్రింద ఎస్టిమేటుచేయుటకు బదులుగా షేర్లులేక డిబెంచర్ల అసలు కిమ్మతు ఈదిగువఉపనిబంధనల ప్రకారము కంపెనీ ఎసెట్ల నికరకిమ్మతును బట్టి నిర్ణయించవలెను.

2. పైనచెప్పిన ప్రకారం నిర్ధారణచేయుటకు

(ఎ) 36 వ సెక్షను 1వ సబ్ సెక్షనుప్రకారము కంపెనీ ఎసెట్ల అసలు కిమ్మతులోనుంచి, 10 వ నిబంధన 1 వ ఉపనిబంధనలో అందలి 'బి' పేరాలో చెప్పినట్టిన్ని 1వ పేరాలో పద్ధ నట్టిన్ని మినహా అని మార్పులతో 17వ సెక్షనుక్రింద్ర మరణానంతరం ప్యాసయేకంపెనే ఎసెట్ల విషయమై ఇవ్వబడు మినహాయవలెనే కంపెనీబాధ్యతలకు మినహా మొత్తము తీసివేయగా వచ్చే మొత్తమునే కంపెనీఎసెట్ల నికరకిమ్మతుగా తీసికోబడును.

(బి) మరణకాలమునకు ఇస్యూచేయబడినట్టిన్ని, నిలచి యున్నట్టిన్ని అన్ని షేర్ల డిబెంచర్ల మొత్తము కిమ్మతు కంపెనీ ఎసెట్ల నికరకిమ్మతుగా తీసికోబడును.

(సి) మరణకాలమునకు ఇస్యూచేయబడి నిల్వలోనున్న షేర్లున్ను డిబెంచర్లున్ను కూడానున్ను లేక, వేరువేరురకములవి రెండు కూడానున్ను ఉండియున్న కేసులో కంపెనీఎసెట్ల నికర కిమ్మతువాటిపై వాటిరైట్లననుసరించి పంచిపెట్టవలెను.

(డి) ఒకషేరు, లేక డిబెంచరు లేక ఏ తరగతిలోనిదైన ఒకషేరు డిబెంచరుయొక్క కిమ్మతు ఈ ఉపనిబంధన (ఎ) పేరా ప్రకారం నామినల్ కిమ్మతును బట్టి నిర్ణయించిన కంపెనీ

ఎసెట్లు నికరకిమ్మతుగా ఎంచి లేక ఈ ఉపనిబంధన పేరా (సి) లో చెప్పిన కేసులో ఆ పేరా ప్రకారం షేర్లకు, డిబెంచర్లకు లేక వాటి తరగతులకు వంపకము చేసిన అందలి భాగము అయివుండును:

3. ఈ నిబంధన నిమిత్తము ఈ క్రింది సందర్భములలో ఒకగు ఒక కంపెనీపై కంట్రోలు కలిగియున్న క్లెయించబడును.

(ఎ) కంపెనీ అంతకును సంబంధించిన అన్ని విషయములలోను లేక ఏ ఒక విషయములోను పవరు చలాయించిన యెడల వానికి మెజారిటీ వోట్లు వచ్చునట్టి వోటింగుపవరు పై వారికి కంట్రోలున్న యెడల, లేక

(బి) కంపెనీ డైరెక్టర్ల బోర్డు లేక గవర్నింగు డైరెక్టరుయొక్క పవర్లు లేక కంపెనీలో మెజారిటీ డైరెక్టర్లను లేక గవర్నింగు డైరెక్టరును నామినేటుచేయు పవర్లు అందలి ఒక డైరెక్టరును ఎప్పాయింటు చేయుటకు వీటో పవరున్న ఇంకా ఇటువంటి యితర పవర్లు ఎవరైనా కలిగియున్న యెడల లేక తాను చలాయించగలిగిన పవరు చలాయించి అట్టి కంట్రోలు లేక తాహతు లేక పవరును అతడు కలిగియున్న యెడల నున్న కాని వాని సమ్మతిని ఇతరులు కలిగియుండు యెడల నున్న,

4. ఎన్నికగల స్టాకుమారకం వల్ల వ్యాపారము చేయుటకు పెర్మిషను యివ్వబడినట్టిన్నీ, మామూలు వ్యాపార సరళిలో అస్టాకుమారకంమీద చనిపోయినవాని మరణముతో అంత్యమైన సంవత్సరములో వ్యాపారములు రికార్డు చేయబడినట్టిన్నీ, తరగతిషేర్లు డిబెంచర్ల మదింపుకు ఈ నిబంధన వర్తించదు. అట్టి తరగతి షేర్లు డిబెంచర్లు కలిగియున్న కంపెనీకి 2 వ ఉపనిబంధన 'సి' క్లాజుక్రింద ఎపోర్షను చేయుటలో ఆ తరగతి షేర్లు డిబెంచర్లకు ఎపోర్షను చేయువలసిన ఎసెట్లు

కిమ్మతు భాగమును అట్టి వ్యాపారములకు రికార్డుచేసిన ఖరీదులను బట్టి నిర్ణయించవలెను.

5. ఈ నిబంధన నిమిత్తము, నమ్మకముతో కూడినపదవి (ఫిడ్యూషియరీ కెపేసిటీ) లో కంపెనీపై కలిగియున్న కంట్రోలు వదలివేయవలెను.

6. ఈ నిబంధనలో 'కంపెనీ ఎసెట్లు' అన్నచోట్ల, చనిపోయిన వాని మరణకాలమునకు కంపెనీకి ఉండు ఎసెట్లని అర్థము చేసుకొనవలెను.

**16.** ప్రతి ఫలమునకు మినహాలు, పరిమితులు : కంపెనీ సంబంధము ఉన్నపుడు చనిపోయినవానిని తప్పించుటయున్ను,

రొఖ్ఖ ప్రతిఫలముగల వ్యాపారములకు మినహాలను గురించి చెప్పిన ఈ ఆక్టులోని 26 వ సెక్షను నిమిత్తము ఒక కంట్రోల్డు కంపెనీ సదరు సెక్షనుప్రకారం మినహా క్లెయిము చేయుసట్టి వ్యాపారముతో గాని సంబంధము కలిగియున్నయెడల అట్టి ఎస్సోసియేటెడ్ ఆపరేషనులలో ఒకటి లేక కొన్ని అయిన వ్యాపారములతోగాని సంబంధము కలిగియున్నయెడల ఈదిగువను చెప్పిన సందర్భములలో సదరు 21 వ సెక్షను ఎంత మట్టుకు వర్తించునని తృప్తి కలుగునో అంతమట్టుకు అది వర్తించును. ఆ సందర్భములు ఏవనగా, కంపెనీ మెంబర్ల తరపున యున్ను కంపెనీ వ్యాపారము నిమిత్తము కాకుండా ఇతరత్రా కంపెనీషేర్ల డిబెంచర్లకు సంబంధించిన రైట్లననుసరించి, ఏర్పాటు చేసుకున్న షరతుల ననుసరించిన్ని, కంపెనీ ఋణబాధ్యత వహించినటువంటి మరొకరి తరపునయున్ను ట్రస్టీ ఖాతాలలో ఆ ఎసెట్లను కలిగియుండి అట్టి ఖాతాలలోనే కంపెనీ వ్యవహరించుటకున్ను అట్టి ఎసెట్లను కంపెనీ వ్యాపారములో ఉపయోగించుటకున్ను పవరు కలిగియుండుటయున్ను, పైన చెప్పిన సందర్భములై యుండును.

2. 11 వ సెక్షను 2 వ సబ్ సెక్షనులో చెప్పినప్రకారము చేయబడిన లేక చేయనివ్వబడిన ఒక మరణానంతరం అంత్యమయ్యే ఇంటరెస్టుయొక్క అన్యాక్రాంతము లేక అంతరింపుతో గాని లేక 6 వ నిబంధన 3 వ ఉపనిబంధనలో చెప్పినట్టిస్నీ చేయబడినట్టిస్నీ సరెండరుతో గాని, ఎసెస్సిమేబెడ్ ఆపరేషనుల లో ఒకటి అయిన అట్టి అన్యాక్రాంతము అంతరింపు లేక సరెండరుతో గాని ఒక కంట్రోల్డు కంపెనీ సంబంధము కలిగియున్న యెడల ఆ ఇంటరెస్టు కలిగియున్న వ్యక్తినిగాని చనిపోయిన వానిని గాని పూర్తిగా తప్పించేటట్టిస్నీ సదరు 2 వ సబ్ సెక్షను లేక 3 వ ఉపనిబంధనలో చెప్పిన లాభమును ఇచ్చేటట్టిస్నీ కండిషను పైన చెప్పిన సందర్భములలో అట్లు చేయబడునెడల తృప్తిచేయబడిన క్లైంచబడును.

17. ఇన్వెస్టుమెంటు కంపెనీ (పెట్టుబడి కంపెనీ) అననేమి ?

17 వ సెక్షను 4 వ సబ్ సెక్షను (iv) క్లాజు నిమిత్తము ఒక కంపెనీయొక్క రాబడి ముఖ్యముగా స్టాకులు, షేర్లు డిబెంచర్లయందు చేసిన ఇన్వెస్టుమెంట్లనుండి వచ్చేయెడల, అనగా కంపెనీ ఒక వ్యక్తి అయినయెడల ఇన్డియన్ ఇన్కంటాక్సు ఆక్టు క్లాజు 6 ఎ. ఎ. లో చెప్పిన (ఎరన్డు ఇన్కం) సంపాదించిన రాబడి, సదరు ఆక్టు 23-ఎ సెక్షను క్రింద కంపెనీకి ఎపోర్షన్ చేసిన రాబడి అయియుండని ఇన్వెస్టుమెంటువల్ల వచ్చినరాబడిగా ఎంచబడును.

రిపబ్లిక్ ప్రింటింగు వర్క్సు, కాకినాడ.

# తప్పొప్పుల పట్టిక.

| లైను. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- |
| 15 | మాటలో | మాటలలో |
| 13 | Viw | View |
| 23 | నిబధన | నిబంధన |
| 11 | అమలోనికి | అమలులోనికి |
| 22 | చనిపోప్రతీ | చనిపోవు ప్రతీ |
| 1 | ఉన్నయొదల | ఉన్నయొడల |
| 27 | గురించిన్నీ | గురించిన్నీ |
| 1 | తానేచేసివ | తానేచేసిన |
| 7 | రొక్షి | రొక్ష |
| 3 | చెప్పిస | చెప్పిన |
| 14 | ఎస్టేటు | ఎస్టేటు |
| 13 | తరాజీ | తవాజీ |
| 4 | సా్య | పొ్య |
| 3 | అయిున్నప్పుడు | అయి యున్నప్పుడు |
| 9 | విం చవచ్చును | విధించవచ్చును |
| 15 | చెల్లించలేధిని | చెల్లించలేరని |
| 23 | కొన్ని | కొన్న |
| ,, | హీమా | హామీ |
| 20 | తిరికి | తిరిగి |
| 8 | యివ్వవనసిన | యివ్వవలసిన |
| 15 | సముజాయిషీ | సముజాయిషీ |
|  | సి. సేట్లు | సి. స్టేట్లు |
| 22 | నిబందన సంఖ్యలేదు | 3 |
| 13 | ఆ అమ్మకము | ఆ అమ్మకము |
| 3 | అష్టరు | అష్టను |
| 21 | రెట్లు | రెట్ల |

| పేజీ. | లైను. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 91 | 6 | మోర్టాలిటో | మోర్టాలిటీ |
| | 25 | ద ఖాలను | ద భాలను |
| 93 | 18 | ఇచ్చినప్పటినిన్నీ | ఇచ్చునప్పటికినిన్నీ |
| 94 | 6 | ED | $ED_1$ |
| | 11 | ED | $ED_1$ |
| | 13 | ED | $ED_1$ |
| | 25 | ED | $ED_5$ |
| 96 | 10 | మెంసిలేపియన్స్ | మెంసిలేసియన్స్ |
| | 25 | సర్టిఫీకెట్టు | సర్టిఫికెట్టు |
| 98 | 1 | సరిఫికెట్టు | సర్టిఫికెట్టు |
| 108 | 24 | సంవత్సరములలో | సంవత్సరములో |
| 113 | 6 | పెచ్చుకున్న | పుచ్చుకున్న |
| 118 | 9 | ప్రవరు | పవరు |
| | 11 | సెడెను | సెడలను |